శ్రీరామ.

# ప్రహసనములు—పత్రికావిలేఖనములు.

కూచి నరసింహము.

మొదటికూర్పు ౩00 ప్రతులు.



పీఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

 1923. [వెల 12 అణాలు

# విషయసూచిక:

పరిహాసనములు.





శ్రీ

# కొత్త తెనుగుతమాషా.

(ఒకు సిక్స్త్ఫారంపిల్లాడు యీకిందది రాస్తాంటాడు.)

దేవుడికి దణ్ణాలు! దేవుడికి దణ్ణాలు!
కొత్త తెను గొచ్చింది! కొత్తెనుగు వచ్చింది.

దిక్కుమాలినపాత తెనుగు పోతూవుంది
బతికాన్ రా! బాబు! బతికాన్ రా!
'ఉష్ట్రాలు' లే విహాను 'ఉత్త్రీపీచు' ల్లేవు
బతికాన్ రా! బాబు! బతికాన్ రా!
చదవకుండా తెనుగు వచ్చిన ట్లొస్తుంది
రా కేం జేస్తుంది రావడం లేదా?
'ప్రాంచెనుగుంగమ్మంటి పాత్తెనుగు తొంగుంది
బతికాన్ రా! బాబు! బతికాన్ రా!
సంధులూ గిందులూ చచ్చుసూత్రాలన్ని
పోయాయ్! పోయాయ్! పోయాయ్ రా!
మనభాషలో ఫెయిలు మాయన్నై పోయింది
మార్కులన్నీ మనవె! మరేమి టున్నాది!
బూతుమాట ల్లేనిపొస్తకా లన్నిన్ని
బౌరతా లన్తాయి! పాతాల కొస్తాయి!
చూడడం, చదవడం, చూపించడం, దిద్ది

తన్నడం, తిట్టడం, తప్పి పోయిందిరా!
యింతసులభబ్భాష యిహా యెక్కడున్నాది?
దాన్ని దెచ్చినవాళ్లు దైవాలు! దైవాలు!

వహ్హా మహాబాగా వొచ్చింది కవిత్వం! ఇది నాక్లాసులో నేస్తాలికి చదివితే యెంత మెచ్చుకుంటారో!

(వరహాల్రావ్ అనేయింకో ఆక్లాసు బ్రాహ్మణబొట్టెడు వొస్తాడు.)

వ—ఏఁవోయ్! వెంకట్రత్నం! మహా ఆలోచిస్తూన్నావు! కాకితంమ్మీదనుంచి కళ్లు యివతలికి తిప్పకుండా చూస్తూన్నావు! నీలో నువ్వే నవ్వుకుంటూన్నావేఁవిట్రోయ్! నాక్కూడా కాస్త చెబుదూ!

వెం—మాభాగే! అలాగే చెబుతాను కూచో! మంచిసమయానికే వొచ్చావులే! యిదుగో చూడు! ఆమహారాజులపుణ్యాఁవా అని చిన్నయ్యసూరిభట్టీయం పోయింది. బతికాఁవ్! ఆసంతోషం పట్టలేక పజ్యాల్చేశాను. వింటే చదువుతాను.

వ—సరే! యింఖాయేఁ? ఓ ర్కీతస్నా గొయ్య! భోజరాజున్నూస్తే యెప్పుడో వెనక అందరికీ కవనఁ వొచ్చేదిట' మోడరన్తెలుగు మొఃఘం జూస్తే నీకు వూరుతూందా యేఁవిటి కవిత్వం? యేదీ! చదువు, చదువు, విందాం.

వెం—(రాశింది చదివి వినిపించి) బాగా వుందా? నువ్వు పాత్తైను గంటే పడి చస్తావు. నువ్వు బాగుందంటే, యిఘు పాన్అయిందన్నమాటే! యింకా యిలాటివి కొన్ని చేసి నన్నయభట్టు కిరీటం లాక్కొని నానెత్తిమీద పెట్టుకుంటాను. Chaucerను modernise చేశారే, అలా చేసి, పేలాలు వేయించి, మరీ

వాదిలిపెడతా! నాతమాషా చూస్తుగాని.

వ—ఓ! యేఁవద్ధాన్నంచతుర్మధ్యంగానో వుంది. నా చెవికి, ప్రాఁ దెనుఁ గుఁగమ్మా, కొత్త తెనుగురిమ్మా, హాలాగే వున్నాయి.

వెం—(కోపంతో) పంది బురద మెచ్చుంది పన్నీరు మెచ్చుందా! అన్నట్టు దిక్కుమాలినచిన్నయ్యసూర్లా, అప్పకవీయాలూ, నరసభూపాలీయాలూ, తెగజదివి, ఉర్వేశి, యేడిశి, మొత్తుకున్నముండకొడుక్కి—యీ chaste, intelligible, simple, homely, dignifiedly colloquial తెలుగు నచ్చుతుందా యేఁవిటి! కాని నా రాతలో లోపా లేఁవిటో? కొంచెం చెప్పమ్మా!

వ—కొప్పడవుగద? వున్న దున్నట్లుచెబితే వుడుకుతార్లే చాలామంది! యేఛందస్సు రాశింది? గణాలేఁవిటి? యతులేశావు. ప్రాసలు సున్న. యిదంతా హాలీమోస్తరుతమాషా రాతలాగుందే!

వెం—ఉఁ ఉఁ!! మోడరన్తునుక్కు ప్రమాణాలేఁవిటి నీ మొహం! జారుగా, Natural గా, చెవికింపుగా, బడబడ ల్లేకుండా, రావాలి కవిత్వం. యింగ్లీషు Poetry మోస్తరుగా వుండాలి. నీకెప్పుడూ వెధవసీసాలూ, కందాలూ, గీతాలూ, కావాలి. తాతల్నాటివే పట్టుకొనియేడుస్తూంటే భాష పెరగడం యెలాగు? అలా చేశారు గనకనే మనభాషకి యీతిప్పలూ చావున్నా. యతులేశానన్నావు. అవ్వినే వెయ్యాలని వేశాననుకొన్నావా యేఁవిటి? వాటంతట వొచ్చాయి. అలావొస్తే నేగాని కవిత్వఁ వేఁవిటి?

వ—(నవ్వుతూ) ఉద్దండుడ్లా గున్నావే! యీమాటకు కొత్తగా కల్పించావా యేఁవిటి?

వెం—ఆ—హాలీమోస్తరుగా అలాగే—నిశ్చలఁవమూ గురుడ! నిశ్చ

లఁవయా !—మీద improvement. అంతా హోమోస్తరుగా వుండదులే. అలా వెఱ్ఱిచూపు చూస్తూన్నావేఁవిటి ? యింగ్లీషు లో మోస్తరా? Iambi క్కులలో Trochee లు, Trochee ల్లో, Anapes ట్లు, Hypermetrical lines, వుంటాయి చూశావా! అలాగే యిదిన్నీ. భగణంతరవాత రగణం, రగణంతరవాత నగణం—యీచాదస్త్రాలు అఖ్కర్లేదు. చెవి కింపుగా వుండాలి అంతే! ఒహోహొప్పుడు అంతఅర్థం లేకపోయినా ఫరవాలేదు. "Jack and Jill went up the hill" వంటి Nonsensical rhymes కూడా భాషకు అలంకారఁవే! ముఖ్యంగా గుంటలికి చాలా వుపయోగం.

వ—ఓరి 'ఉప్మా' లూ 'ఉత్ప్రీచు' లూ యేఁవిటా? నీబుర్ర!

వెం—అవ్వీ—'ఉపమ' 'ఉత్ప్రేక్ష'—వీట్లోనుంచి పుట్టినచులాకని తెలుగుమాటలు. 'మనుష్య' శబ్దభవము 'మణిషి' యెరుగుదువా? అలాగే 'ఉపమా' శబ్దభవము 'ఉప్మా'. శ్లేషక్కూడా పనికొస్తుంది. ఎవడిమట్టుకు వాడు తద్భవాలు చేస్తూంటేనే గాని, భాష చందుపడుతుంది—కదలదు—జరగదు-పెరగదు.

వ—ఓ ర్నీసిగ్గు చిఁవడా! మనుసొచ్చినట్టల్లా చేయడఁవేనట్రా! హోకట్టూ యేఁవీ అఖ్కర్లేదూ? కాని పరుషాలముందూ సరళాల ముందూకాకుండా, 'న' ముందు అర్థానుస్వార పెట్టావేఁవిటి?

వెం—అర్థానుస్వా రేఁవిటి? నీశ్రాద్ధం! అరసున్నను—సహాంసున్నంటే మరీ మంచిది. పాతవ్యాకరణాల్లో మాట్లు వేయకూ. నాకు తల్లొప్పి. యెలా మాట్లాడతాఁవో అలారాయాలి. కొన్ని Sounds కి మనభాషలో Symbols లేవు గ్రహచారం! Phonetic symbols వేస్తే బాగుంటాయి. అందుకోసఁవే, కొ

న్నతక్షరాల నెత్తిమీద మిల్లిగరికెలు పెట్టేను.

వ—వాళకం బాగావుందిరోయ్! యింట్లో మాట్లాడ్డట్లు యిస్కూళ్లలో
యేడిస్తే యిహ భారతాలు భాగోతాలు యేఁవవుతాయి? యె
లా తెలుస్తాయి?

వెం—అవునో! దిగుతూన్నాయి! చిలకపలుకులు! పండితుత్తెగులే
నీకూ వొచ్చింది? భారతాలే భాషకొంపతీశాయి. వాట్నన్ని
ట్నీ కలిపి కట్టగట్టి వుప్పుటేట్లో పారదొక్కు. Chaucer యేఁ
వైంది? Spenser యేఁవైంది? వాట్లగతీ అంతే.

వ—ఓరిబాబు! మాట్లాడితే యింగ్లీషు తీసుకొస్తావేఁవిరా? నాకు పం
డితుత్తెగులన్నావుగాని నీకు యింగిలీషుబొల్లిదెయ్యం బట్టిన
ట్టుంది. అలాగైతేపట్టుమరి! "బుట్ట" బ్—ఉ—ట్—ట్
—అ—అనాలి; రాయడం ఒహమోస్తరూ పలకడంహో
మోస్తరూ, కానీ! వెర్రితీరింది రోకలి తలచుట్టమన్నట్టుంది.
మాట్లాడేటట్టు రాయమంటావుగదా, యెవరు మాట్లాడేటట్లు?

వెం—యెవరు మాట్లాడేటట్లా? మనమ్మాట్లాడేటట్లు, మణుషులు మా
ట్లాడేటట్లు.

వ—అలాయితే—"నా నిక్క ఉంతాను బాబు—శిన్నముక్డికూడా
కావిల్లో మెట్టుకెల్లు-లెగు, లెగు, సచ్చినట్టు దొంగుండావేఁయ్?
యాజ్జం యిశారణ నీకోసం ఆగుద్దనుకున్నావేఁయ్?—వాడి
తలిదండ్రాదులపుణ్యాఁవండి—గ్రేహాలు శాశ్వితాలుగావండి-
సభాపిరికితనఁవండి—ఇత్యాదులు Modern Telugu లో గ్రా
హ్యాంబులేనా?

వెం—ఛా! ఛా! కాపాళ్లూ, గఁవళ్లాళ్లూ మాట్లాడ్డట్లుట్రా?

వ—వాళ్లమాత్రిం మనుష్యులు గారాయేఁవిటి? బ్రాహ్మలకంటె వా

శ్లసంజ్ఞ్యో యెక్కువగనక వాళ్లమాటల్లో గ్రంథాల్నే న్తేనే బహు జనోపయోగకరము.

వెం—అంథా exaggeration—విరుద్ధప్పాటలు. మంచ్చిబ్రాహ్మలు మాట్లాడేటట్టు రాయరాదూ?

వ—అవయితే విను. కావలసినన్ని 'షా' లూ 'థా' లున్నాయి—'ఏఁవంచావు?—తినమంథావూ?—ఉంఛానోయ్-ఒచ్చినవ్వాంటివాడామెనూ-తెనుగంతా గంగలో కలిశినవ్వంటిదామెనూ!

వెం—ఏఁవిటీ వెక్కిరింతలూ వెకరాకొకరాలున్నా? వెధవ, చచ్చు, బడబడ, తెలివితక్కువ, అర్థాన్నపు పాత్రెనుగులో రాస్తే ఒహ ముక్కా తెలుస్తుందా యేడుస్తుందా?

(అంత వోహాపడఁవటియాయవారబ్రాహ్మ డొచ్చి—"శీతారామాభ్యాన్నమహా—వ్వాయి మాయబ్బ!—యేఁవ్ కాల్నొప్పబ్బా, దీం నుంపదెగ!—కాశిని బియ్యఁవిస్తాబట్రా వయ్యా—" అనంటాడు.)

వ—యిదుగో! యిదో సొగసైన Modern Telugu—విన్నావా? యేఁవ్వన్నెలు! యేఁచ్చిన్నెలు! మఁశిపికైనా భాషకైనా కట్టు తప్పితే యివ్వేపాట్లురా నాయనా!

(అంతట్లో లోపల్నుంచి—"అతగానెవరో అరుస్తూన్నాడు. అయ్యా—చేతులో పని లావుగావుంది—వొగ్గేసి రావడానికి వీల్లేదు—గుంట ల్చెప్పినట్టు విన్రు—బియ్యానికూడా యిప్పుడే తోలేశాఁవ్—యివాల్టికి వెళ్లునాయనా—అన్నమాటలు వినిపిస్తాయి)

వ—గోరిబాబు! యిదొహారకం Modern Telugu—అయితే పాత్రెనుగులో రాస్తే వోహాముక్కా తెలియదని చెప్పావు, తెలియక

పోతే అంథా మెలాచదువుతూన్నారా?

వెం—ఏఁవిటి నీమొహం చదవడం? పరీక్షకోసం అటూయిటూ తం

డ్రితద్దినన్లాగు చదివేదీ, Examination Hall లో ఆకాస్తా వె

ళ్లగక్కేడీ, అవతల శంఖరంగా అంటూ కూచుండీదిన్నీ! బి. యేలు యింగిలీషులో తెచ్చర్లిస్తారు, పోస్తకాలొ్రాస్తారు, అన్ని Subjec ట్లలోనూ Professo ర్లవుతారు, తెనుగురాసినవాణ్ణి

చూపించూ!

వ—నీవు చెప్పినమాట కొంతమట్టుకొప్పుకుంటాను గాని, దానికా

రణము తెనుగులోపం గాదు—భాషాభిమానం లేకపోవడం

చాతా, డబ్బు రాకపోవడం చాతానున్నూ—అయినా యీ

మధ్య చాలామంది పోస్తకాలొ్రాశారే! రాస్తూన్నారే! రా

శినవి వేలకొద్ది కొంటూన్నారే! యెన్నినాటకాలో, యెన్నినవలలో, యెన్నిచరిత్రలో, పాఠంపెట్టకపోయినా, ఖర్చవుతూ

న్నాయి టే? చదవడాని క్కాకపోతే డబ్బెట్టికొంనుగదా! తెలి

యకపోతేచదవరుకదా! కనక పాత్తెనుగు చచ్చిందనీ, చదువు

కొన్నవాళ్లక్కూడా తెలియదనీ నీలాపనిందలు వేసి బొమ్మగట్టి

యేకడం కేవలఁవన్యాయఁవ్—అది వొట్టి అబద్ధఁ! వబద్ధఁవ్!

వెం—కొత్తతెనుగుమాత్రం తెలియదా యేఁవిటి? మహాతెగనీలుగు

తావ్—డంబాలొ్రత లెందు కేఁవిటి?

వ—డంబాలొ్రక లొద్దు—సులభంగా రాయొచ్చు—రాస్తూనూ వు

న్నారు—వావిలికొల్లు సుబ్బారావుగారు ఆర్యకథానిధీ అవ్వీ

రాయడంలేదూ! తెనుగు పాడిచేయడ న్లేదుగాని—చదివితే

తట్టుగాలి! తెలియకేఁ? కొద్దో గొప్పో సులభపోస్తకాలు పా

త్తెనుగులోనే రాస్తూన్నారు గాని కొత్త తెనుగులో, గ్రింథా

తెక్కచేసేశాయి? రాబోయే పుస్తకాలు యిప్పుడు చదవమన్నావూ? రాసినవాటి రెండుతడకలూ—ముండా కాదు; ముత్తైదువా కాదూ. ట్రాంకైతొమ్మిది షేవరంచేసిన పాత్తెనుగు మాటలూ, ఒహమాట Modern Telugu మాటూ, మధ్యమధ్య యింగిలీషు దోపక్లేకాదూ? యీభాషవ! రాయాలవ! యిస్కూళ్లలో నేర్పాలవ! వున్నదొందులుకొని యెప్పుడో వాచ్చివాలికించేభాష యిప్పుడు రాయడం యెలాగు? చెప్పడం యెలాగు? కుర్రాళ్లా గ్రంథకర్తలు? వాళ్లా భాష తిరగదోడే సంస్కర్తలు? "చిట్టటకమీద వుప్పుబుట్ట కొండువా" అన్న ఆంధ్రవైష్ణవుల అరవంపామ్యంవా రాతలు? దొరగారికి వీభూతీ రాశి కూర్చోబెట్టడంవా?—సహం తెలుగూ, సహంయింగ్లీషు—యిదేనానీ Modern Telugu? ఏడిశినట్లేవుంది. హూప్రిమాణం, హోసు చెప్పడంలేదూ? యెవడికివాడే కాళిదాసా? యిల్లల్లా నిట్రాటలయితే, తలంతా బొప్పులుకావూ? తప్పులన్నమాట తుప్పున యెగిరిపోయిందేం? ప్రతిగుంటడిభాషా వేదభాషా? ఆరాబోయేభాషకు అప్పుడే వ్యాకరణసూత్రాలా? గగనసౌధానికి నిచ్చెన్లేయడంవా?

Modern Telugu కావా లనేప్రబుద్ధులు, వారివాదాలన్నీ తెనుగు వ్రాయక యింగ్లీషులో యిరికించడం యేంవిటి? అందరికి తెలిసిపోతుందనా? వేదమంతా మింగరనా? యింగిలీషు తెలియని ముసలిపండితులు పూర్వపక్షాలు చేస్తారనా? అమాయకప్రజకళ్లల్లో దుమ్మోశి మశిబూశి మారేడుకాయచేశి తంవరే యేలేశ్వరపు వుపాధ్యాయులని అనిపించుకుని, పంతం నెగ్గించుకుని, భాష ధ్వంసంచేయడానికా? అంతా అయోమయంగా

వుందే! చక్కగా Modern Telugu లో వ్యాకరణాలు, ప్రజలకు యిలా రాయాలని రాసి చూపించొచ్చునే! అలా యెందుకు చెయ్యరూ? పండితులమీదికి బడితె పుచ్చుకొని బయద్దేరడంవా? నిక్షేపంవంటి తెనుగుని, పాత్తెనుగనీ, చచ్చుతెనుగన్నీ, యింగిలీషు భాషలో శాపదగ్ధాలా? ముక్కామొహాలంతేని చిల్లంగిరోగం వచ్చిందే పాపం బంగారంవంటి తెనుక్కి?

యివేగాక, మాట్లాడేభాషే గ్రంథాల్లోకి యెక్కించాలంటే చాలామందిమాట్లాడేభాష రాయకూడదూ? పరప్రామబ్ర్యా హ్మబ్బా వున్నయింట్లోభాషమాత్రంవే సుష్టా? బల్తమాషా గా వుందే! అలాయితే వుద్యోగంలో వుండి డబ్బుసంపాయి స్తూన్న జక్కరయ్యా (Zechariah) గారిభాషా, పెడ్రిక్కు (Frederick) గారిభాషా గ్రాంథికభాష్యైయ్యరాదూ? అలా టివాళ్లే యెక్కువున్నట్టున్నారే యీదిక్కుమాలినబ్రాహ్మలకంటె! అది పనికిరాదూ? వులాన్ఘలహారంవా? స్నానం మడిబట్టలూ కావాలీ? యిది మంచీ యిది చెడ్డాఅని చెప్పే దిద్దేపెద్దలు తెనుగు అంటూసొంటూలేని, మురుగేశమొదల్యారు P. C. P. I. L. (Professor of Comparative Philology of Indian languages)గా రొహాకున్నా, మౌల్వీఅబ్దుల్లావర్ సాహెబ్బహాదూర్ S. F. S. A. (Senior Fellow of Semitic Academy) గా రొహాకున్నా?

తమిళ్లల్లో 'నేను' కి 'నాన్' అని యిక్కడి—రెండుసంబంధమానబాషగళ్—అరవత్తి లిరుందు తెలుంగు పిరందద్—హాల్లులంతసొర్పకాలత్తిల్, Phonetic laws ప్రకారం, అచ్చులరగవు—తూప్పుకొపనే 'నా నుంతాను బాబు' లో 'నాను'

శులుగారి కొమారుడు, సున్నిపసిగరెల్ల బోడిగుండు పరబ్రహ్మ శాస్త్రుల్లు—

మసిబొగ్గునీకలు తెల్లగాజడే మొఖమువికాసంగల సూర్యకాంతంనాయుడు—వీధుల్లో కుక్క బొంయ్యిమంటే యింట్లో గొంచీ తముపుకొన్నే ప్రితాపనుకిశింహ రాజు—మూడువాట్లు దివాలాకీశిన సుబ్బెల్ల పోలిశెట్టిగాడికొడుకు, రత్నమాణిక్యం—శిస్తు యివ్వలేక జరాయితీ అమ్ముకొన్న వుమ్మెత్తల బాపనయ్య ఆరోకొడుకు గడ్డెయ్య—మొన్నమొన్నటిదాకా మాలగొరిశెల వుల్లిగాడికొడుకై మతంపుచ్చుకొని, పచ్చిదొర్లాగు వేషంవేసుకుని క్లాసుల్లో కాలిమీద కాలేసుకుని కూచునే Paul దొరగారు—Messrs Shambles & co మేనేజరుగా రైవపకర్ణీన్సాహేబుగారిదత్తపుత్రుడు, నత్తిఘత్తిమహామ్మద—యిత్యాదులు, రకరకాలువుంటారు.

మీరందరూ మాట్లాడుకునేటట్టే రాయొచ్చును రాయంఢంటే కేకింతాలుగొడుతూరాస్తారు—కాని—అవన్నీకలిపిచూస్తే, గంట్లుకొట్టిన రాచ్చిప్పలాగున్నా, చిన్నాపెద్దా, లోతూ మెరకా, కోలా గుండ్రో, తెల్లా నల్లా, తమాషా తమాషా మశూచకమచ్చల—అనన్యసామాన్యశోభావిరాజమానదివ్యసుందరముఖమండలం—లాగున్నా వుంటాయి.

పరబ్రహ్మశాస్త్రుల్లు మాట్లాణ్ణట్టు అందర్నీ రాయమంటే, బట్టతమవుప్రితాపానికి పట్టరానికోపం—ప్రతాపంలాగు రాయండంటే, సూర్యకాంతం మొఖం, మాణిక్యం మొహం, తుమ్మల్లో పొద్దుకూకినట్లుంటాయి—మాణిక్యంలాగు రాయమంటే, గడ్డెయ్య భద్దో మండిపడతాడు—పోనీ! గడ్డెయ్యభాషే

రాయమంటే Paul దొరగారు పళ్లుకొరుకుతారు. అబ్బబ్బా! దొరగారిమోస్తరుగానే రాయరా? ! మీయిల్లు వొల్లకాడు గానూ! అంటే, సత్తిసాహేబుగారు తుంపర్లతో అందరిమొఘాలూ తడుపుతారు. యలాగునురి దేవుళ్లాట?

ఇహా తెనుగుదిద్దేమహానుభావులు, యీపంచకూళకషాయపు అవకతవకలన్నీ చూశి అనుభవించి తేలుకుట్టినదొంగల్లాగు ఫూరుకొంటూరు. ఆకాశిని తెల్లబిళ్లలకోసంగాబోలు, యేవి తప్పులకింద కోశిపారేయ్యాలో, యేవి మంచివికింద యెంచి మార్కులివ్వాలో తెలియకుండానే 70%, 80%, 90% మార్కులవర్షము పిల్లలపైనిన్నీ, పిడుగులవర్షము అమాయకపు తెలుగుభాషపైనిన్నీ కురిపిస్తారు. మనతెనుగువాళ్లస్థితి యిందులోకి దిగింది ఆఖరికి! యేఙ్ఞేప్తున్నావు నాయనా!

వెం—ఓర్నీగోలకూల! యిలా శివాలాడతావేఁవిరా? నేనుమాత్రిం, తంబల, యీడిగ, మాల, మాదిగ, చచ్చుటభాషర్రాయమన్నానా? చదువుకొన్న—తెనుగుచదువుకొన్న—బ్రాహ్మడు-అతి ఆయాసంలేకుండా, కోపఁవదీలేనప్పుడు, చదువుకొన్న పెద్దమనుషులయెదట, ఆలోచించి, careful గా, deliberateగా, respectful గా, elegant గా, యెలామాట్లాడతాడో—అలా రాయాలని నాఅభిప్రాయనా! యిదంథా యెందుకు?

వ—ఏఁవి నన్నాయినొక్కర్రా! యీయింగ్లీషూ తెలుగూ కలగలుపుధప్పళఁవ్తయారైతే, కాస్తకూస్త తేడాగా పాత్తెనుగుపాకానికే వొస్తుందనుకొంటాన్నేను! (యిద్దరూ వెళ్లిపోయొస్తారు)

ఫలశ్రుతి.

శా. స్కూల్ఫైనల్తెలుగంటుమార్కులుఘనఁవ్, ఇంటర్ప్రివేశంధ్రువఁవ్

తప్పులార్తిన తప్పులంటు నెవమూనోరెత్తకుం పుండడేవ్,
పూర్వగ్రంధుపులన్ని మూలబడడేవ్, రావంటు-ఊమూల్గడేవ్,
భాషంతాచెడదీశి కూచుని లబోలబోబ్బయటుం చేడ్వడేవ్.

గద్య.

ఇది సర్వస్వంసాధ్యాయమాధిగమ నాధ్యాపనవిరాజమాన, శ్రీ తెలుగులాక్షణికగంధసింధకవిమూలకంఠీరవేత్యాది బిరుదాంచిత శ్రీవాగ్నైవిల్లాణ్డేనల్లీభాష్యయదుద్ధిస్పవరుద్ధిస్పిముఖ సద్గురు చరణారవింద నిత్యసేవాధురీణ, మోడరన్తెలుగూర్ధండ చండపాండిత్యసారీణ, చిరకాలపూర్వసర్వస్వప్రసిద్ధప్రాచీనాంధ్రభాషాయోషా ప్రేతసంస్కారణాచణ, నిరుపమానకపటవిద్యాప్రవీణ, దుష్టధరదుర్జనవిధేయ, శ్రవఃపేయనామధేయ, సహజపాండిత్య, 'కొంకనకాక' మాత్యప్రణీతంబైన "కొత్తతెనుగుతమాషా" అనే 'రత్నవరాహసంవాదం' బను చంపూమహాప్రబంధమందు ప్రథమతరంగ్

సంపూర్ణంవ్.

పట్టుదలైన జయతు—కుటిలతు—నాస్త్యేవ్

* అనుబంధము.

హింస—సింహా, వాఘ్లు—వాల్గు, టపాకాయ—పటాకాయ, Drum-roll—రంజోలు, Hippopotamus (horse+river)-river horse, బరుకు-బకురు-అయ్యన్ట్లే Phonetico & Ultra-phonetico-metathetical laws ప్రకారం 'వరహా' 'వరాహా' [illegible]—

శ్రీ రామా.

# మహాప్రసంగప్రహసనము:

సాయంకాల మైదుగంటలు కావచ్చినది. బడిపనిముగిసినది. శీతకాలమునకు వృద్ధదశ వచ్చినది. పొద్దునిలుచుట కారంభించినది. ప్రాణమునకు బయటిగాలిపై నపేక్షపుట్టినది. గంట గణగణ మ్రోగినది. విద్యార్థులిసుళ్ల తెరలవలెఁ బాఠశాలగదులనుండి బయలుదేఱి గంతులువేయుచుఁ గేకరింతలుగొట్టుచు వీథినిబడిరి.

పొట్టిపొట్టివారు, పొడుగుపొడుగువారు, కారునలుపువారు, చామనచాయవారు, తొగరుమొగమువారు, పసిమిరంగువారు, పొడుగుజడలవారు, గిరజాజుట్లవారు, బోడిగుండ్లవారు, నానావిధములైనవా రాబాలకశ్రేణులలో నుండిరి. వలతీసి వదలిపెట్టిన పిట్టలవలెఁ గిచకిచలాడుచు నిండ్లకుఁ బరుగెత్తికొనిపోవు నాపిల్లలఁజూడఁగా నాకు నా బాల్యావస్థ స్మృతికివచ్చినది.

ఆహా! అప్పుడు తెలియకపోయినను, అన్నియవస్థలలోను బాల్యావస్థయే సుఖతమముగదా! తిండి, యాట, నిద్ర—యీచింతలుగాక మఱేచింత లుండవుగదా! సంసారబాధలు తలిదండ్రులవి, సమస్తసుఖములు బిడ్డలవిగదా! ఇట్టికన్నీళ్లు, నట్టిచిఱునవ్వులు గాని దీర్ఘక్రోధము లేదుగదా! ఒక్కఱిమికాయియుండ చేతఁబెట్టినచోనెంత సంతోషముగదా! కనులుమూయుట గాఢనిద్రలోఁ బడుటగదా! ఇటువంటి యూహాసందోహములు పరంపరలుగా నామనోవాపిలో నూరినవి. అక్షితానందప్రదమగు నాద్యావస్థయొక్కటే సృజించి తరువాతఁ జంపి

తీసికొనిపోవక దిక్కుమాలిన యితరావస్థ లేల ప్రాణులకుఁ దెచ్చిపెట్టవలె నని బ్రహ్మను లోపలలోపలఁ దిట్టి పాపముగట్టుకొంటిని. పాపము రానీ, పుణ్యము రానీ, మనసునొచ్చినప్పుడు తిట్టక దీవింతు రాయేమి ?

దుఃఖమువలె నానందముకూడ నంటురోగమువంటిది. కారపుఁ బూస కరకరనమలుచున్న బాలునిజూచి బోసినోరుకూడ ద్రవించును గదా! పిల్లలసంతోషముచూచి నేనును బౌరశాలవెలువడి రెయిలు రోడ్డువైపు షికారుపోయితిని. రోడ్డువెంబడి నొకమైలునడచి పడమటి మొగము పెట్టుకొని యొకవిజనస్థలమునఁ జదికిలఁబడితిని. చదికిలఁబడుట చరమదశాప్రారంభలక్షణము. నడచినది మైలేకాని శ్రమమాత్రము యోజనయానశ్రమ. అపరదిశ, ప్రక్కయంతయు నంటుకొన్నట్లుండెను. గగనరక్తిమ కన్నులకెంతో యింపుగానుండెను. రోజంతయుఁ బనిచేసి యలసి కలఁగినయంతరంగము నిర్మలమై నిశ్చలమై ప్రశాంతమయ్యెను. అక్కడక్కడనుండి మేఁతలుచాలించివచ్చి శకుంతసంతానములు మువ్వలు మొరసినట్లు రవళించుచుఁ జెంతనున్న చెట్లపై వ్రాలు చప్పుడుదప్ప మఱియొకశబ్దము లేదు.

"ఆహా! యింత ప్రశాంతసమయముగనుకనే ధ్యానమునకు ముఖ్యమనియెంచి పెద్దలు కాలముదాఁటకుండ నిప్పుడు సూర్యునకర్ఘ్యమిత్తు" రని యనుకొని నవనాగరకతాప్రభావముచే నించుకమఱపునఁ బడిన సాయంసంధ్యామంత్రమును మఱల నెమరునకుఁ దెచ్చుకొని దోయిలొగ్గి లోపలనే లోకబాంధవునకు ముమ్మాఱర్ఘ్యమిచ్చితిని.

ఇట్టియట్టిదనరాని ప్రశాంతిసుఖములో మునిఁగియుండఁగా "అయ్యా! నమస్కార" మనుమాటలు చెవినిబడెను. ఉలికిపడి ప్రక్కకుఁ జూచితిని. కొబ్బెరముక్కవలెఁ దెల్లగానుండుమరాయితో, దుమ్మెద ఱెక్కలవలె మిసమిసలాడుచుండుకోటుతో, దంతపువన్నెమెడపట్టీతో,

దానిపై నద్వితీయమై భృగుగ్రహమువలెఁ దళతళలాడుచుండు మెఱుఁగుబొత్తాముతో, శిరముపై ధూమ్రవర్ణపుటోపీతో, నప్రయత్నముగనో బుద్ధిపూర్వకముగనో దానినుండి తప్పించుకొని నునుమొగముమీఁద నుంగరములుచుట్టుకొని నిగనిగలాడుచు ముసరుచున్న ముంగురులతో, శూన్యలలాటముతో, సన్ననిచేతిబెత్తముతో, వక్షస్థలమున కొకవైపున్న జేబులోదాఁగి తొంగితొంగిచూచుచున్న చిట్టిజిలుఁగురుమాలుతో, నొకయిరువదినాల్గుసంవత్సరములప్రాయపుయువకుఁడు కనఁబడెను.

అంతట నాతని, నాయొద్దఁ బూర్వము గ్రామాంతరమునఁ జదువుకొన్న ప్రియశిష్యులలో నొకనిగాఁ దెలిసికొని, వందనమందుకొని "రావయ్యా! కూరుచుండు" మని చెప్పితిని. చూచి చిరకాలమైనది గనుక వెంటనే యానవాలు పట్టలేకపోయితి నంటిని. ఇట్లు పికారువచ్చితిరని మీప్రస్తుతశిష్యులు చెప్పుటచేతను మీరువక్క నితరులిక్కడలేకపోవుటచేతను మిమ్ము నాతికష్టముగా గుర్తింపఁగల్గితిని. మీశరీరమునఁగూడఁ జాలమార్పులున్నవని యతఁడు గురువునకుఁ దీసిపోవక ప్రత్యుత్తరమిచ్చెను. "ఔను నాయనా, నీదివచ్చుకాలము నాదిపోవుకాలము" ఇదియే మనయిద్దఱిలోనుండు మార్పుభేదమని చెప్పి, వెనుకటివృత్తాంతములన్నియు జ్ఞప్తికిరాఁగా వానిఁగూర్చి యతనితోఁ బ్రసంగింప మొదలువెట్టితిని. బి.ఏ.పరీక్షలో నుత్తీర్ణుఁడనై బి.ఎల్.పరీక్ష యొకమాఱుతప్పి మఱల నాపరీక్షకే చదువుచుంటిననియు నీగ్రామములో బంధువులుండుటచేఁ జూడవచ్చితిననియు నతఁడు చెప్పెను. పూర్వశిష్యులతో సంభాషణము సంతోషకరముగాదా! నాతలదాఁటిన గురువులెందఱియొద్దనో చదివి పై పరీక్షలలోఁ గృతార్థుఁడైనను ప్రాఁతగురువులలో నొకచిన్నగురువునగు నాయెడల గౌరవప్రపత్తు లగపఱుచుట యతనియోగ్యతను జూపదా? శిష్యులు విద్యాగురువులకుఁ జూపు

డు గాఁడు. కనుక వానిమాట దేవశాసనముగా నెంచఁగూడదు.

నే—నీవిప్పుడన్నయీమాటలు ప్రమాదదోషములులేనివని గ ట్టినమ్మకమున్నదా?

అ—ఉండఁబట్టియే యింతనొక్కి చెప్పుచున్నాను. నాయంత రాత్మ (Conscience) యట్లు స్పష్టముగాఁ జెప్పుచున్నది.

నే—నాయనా! నాదగ్గఱ నీవు చదువుకొనుచుండినప్పుడు నీ యంతరాత్మ యిట్లు చెప్పెనా యింకొకవిధముగాఁ జెప్పెనా?

అ—అజ్ఞానావస్థలోనున్నప్పు డన్యథా చెప్పియే యుండవచ్చు ను. అయిననేమి?

నే—కాదులే! ఇంకొకసంవత్సరముతరువాత నిప్పటిబోధముల కు భిన్నముగా నీయంతరాత్మచెప్పునేమోయని సందేహించుచున్నాను.

అ—ఈతికమకలకు లొంగుదుననుకొనుచున్నారుకాఁబోలు! మీగ్రంథములుమాత్ర మొక్కరీతిగా నున్నవా? ఉన్నయెడల ద్వైతా ద్వైతవిశిష్టాద్వైతభేదము లెట్లువచ్చినవి?

నే—అదికాదయ్యా! భేదములున్నమాట వాస్తవమే. వ్యా ఖ్యాతలయభిప్రాయములలో భేదములున్నవిగాని మూలగ్రంథము లొ క్కటేకాదయ్యా! ఒక్కమూలమునుండి యొక్కచెట్టునుండి పుట్టినశా ఖలు. అందఱు నార్షమతమువారేకాదా?

అ—భిన్నశాఖలైననేమి? భిన్నవృక్షములైననేమి?

నే—ఉన్నచెట్టూడఁబెఱికి యెన్ని మొక్కలువేసెదవు? నీయం తరాత్మచెప్పినట్లు నీవువెళ్లి, నాయంతరాత్మచెప్పినట్లు నేనువెళ్లినఁ, దల కొకయంతరాత్మచొప్పున జనులెందఱో యన్నిమతములుండవా?

అ—గుంటచిక్కువ్యవహారముగా నున్నదే! మీత్రిమతముల కుఁ గొంతసామరస్యమున్నట్లే యంతరాత్మబోధములలో సర్వసామా

వ్యవహారములు లేవా ?

నే—అట్టిచోట్ల బాధయేలేదు. భేదించినప్పుడే బాధ.

అ—మూఁడుబాధలకొప్పుకొని యింకొకబాధ కొప్పుకొనిననేమిబాధ ?

నే—ఒక్కబాధగాదు, సహస్రబాధలు. అంతరాత్మ లేనివాఁడొక్కఁడును లేఁడుగదా! జన్మవయోవిద్యాస్నేహాదిసంపర్కములచే దద్బోధములు భిన్నభిన్నములుగ నుండునుగదా! పూర్వ మెంత తెలిసిన మహానుభావుఁ డొక్కఁడు బోధించుట తక్కుపెక్కు, రవలంబించుట. ఇప్పుడు బోధకులెక్కువ శిష్యులుతక్కువ. ముక్కుపచ్చలాఱనిపిల్లవాఁడు మొదలుకొని తలనరసినతాతవఱకు నుపన్యాసపీఠికలపై కెక్కి మేఘగర్జనములతో నుపదేశించువారేకదా! ఇట్లున్న దేశము బహునాయకమై పాడగునేమోయని భయపడుచున్నాను. మూఁడుశాఖలుండి యైకమత్యమునకు ముప్పుదెచ్చుచున్నవని మొఱపెట్టుచుండుకాలములో నింకను క్రొత్తమతములు పుట్టుచుండిన నవి సమూలముగానశింపదా ?

అ—ఒకప్పుడు మనదేశములో నైకమత్యమేడిచినదాయేమి? తినుతిండియొకటి, కట్టుబట్టలొకటి, బుఱ్ఱలలో బుద్ధులుమాత్ర మెప్పుడును వేఱే.

నే—ఇప్పుడు తిండ్లలోను బట్టలలోనుగూడ భేదపడుచున్నామే! దానికి నీవు నేనే ప్రత్యక్షనిదర్శనములము.

అ—(నవ్వుచు) నాదుస్తునుజూచి యధిక్షేపణముకాఁబోలు!

నే—నాబట్టలుచూచి నీవాక్షేపింపవచ్చును. వాదప్రతివాదములలో నొకరినొకరు ముద్దుపెట్టుకొందురాయేమి? కాని జాతీయతత్వము జాతీయతత్వము, అని ఘోషించుట సభలలోనేనా? ఈమఱాయియేమి? ఆటోపేయేమి ?

అ—ప్రాఁతవిపట్టుకొని ప్రాఁకులాడు మీఁకన్నియు విచిత్రము గానే యుండును. ఉపయోగమునుబట్టి కాలానుగుణముగఁ గట్టుబట్టలు మాత్రము మాఱవాయేమి? అట్లు చూచుచున్నారేమి?

నే—ఏవినాయనా! ఆయుపయోగములు?

అ—ఏవా? శస్త్రచికిత్సచేయునప్పుడు ప్రకృతిశాస్త్రాంశములు శోధించి చూచి చెప్పునప్పుడు మీదోవతి పనికివచ్చునో నాషరాయి యుపయోగించునో సెలవిండు.

నే—బి.ఎల్. పరీక్షకు శస్త్రచికిత్స లేదుకదా! ధనసంగ్రహణ శోధనకృత్యములేకాని యితరశోధనకృత్యము లంతకంటె లేవుగదా! నీకు షరాయి మఱెందులకు?

అ—అయ్యయ్యో? ఈదిక్కుమాలినగుడార్లు చెన్నపట్టణములోఁ బనికిరావండీ! సభలలో షరాయి కెక్కువగౌరవమండీ! ఆనకట్టకూ భూర్వపుమాట లిప్పుడు చెవికెక్కవండీ! అందఱు నవ్వుదురండీ!

నే—జాతీయతత్త్వము కనఁబడుట ముఖ్యముగా వేషభాషలలో నేకాదండీ? వేషభాషలు విదేశీయములైనప్పుడు స్వదేశీయములు చట్టుబండలు గావండీ? పుస్తె తాకట్టుపెట్టి పుస్తకాలు కొనవచ్చును గాని యిల్లమ్ముకొని డ్రిల్లరాయి తొడుగుకొనుటేలండీ! ముందుముం దు మీరేమిసంపాదింతురో కాని పార్వతీపరమేశ్వరులవలె నుండు మీతలిదండ్రుల నిప్పుడు పస్తుపెట్టవచ్చునండీ! కుతకుతలాడువేసఁగిలో షరాయిసుఖ మేమున్నదండీ!

అ—పాదశేషము కోపముతోఁ బూర్ణమగుచున్నది. మీరు కెనిసాడుచు నెన్నిమార్లుకౌపీనముసవరించుకొందురో యెఱుఁగుదురా?

నే—ఎఱుఁగుదును. గోఁచిపడదురులేనప్పుడు కెనిసు మానుకొనవచ్చును గాని, యనివార్యములగు కొన్ని నిత్యకృత్యములు షరాయి

తో నీవెట్లుసాగించుకొనుచున్నావో నాకుఁ దెలియకున్నది.

అ—అన్ని యేర్పాటులు నందులోనే యున్నవిలెండు.

నే—దోవతికి ఖర్చుతక్కువ, నిలువయెక్కువ, సుఖముహెచ్చు. షరాయిమర్యాద క్రొత్తగావచ్చినదిగాని, దోవతిమర్యాద తాతలనాఁటినుండి యనాదిగ వచ్చుచున్నది.

అ—లోపలిపసనుబట్టి లోకములో గౌరవముండునుగాని పైవేషముఁబట్టి కాదుగదా!

నే-దీర్ఘాయుష్యమస్తు! నేఁజెప్పునదియు ఆమాటయేనాయనా!

అ—పోనిండు. కానంతదాని కింతరాద్ధాంత మనావశ్యకము. మీరు పెద్దలు. మనదుస్తులే మంచివని యొప్పుకొనెదనులెండు.

నే—సుఖీభవ! ఒకదానిలో నేను గెలిచితిననుకొనవచ్చును గాన, మొదటిమతవాదములోఁ గొంచెము రాజీనామా చేసికొందము. అంతరాత్మవాద మంతగర్హ్యముగాదులే. రవంత మనయుపనిషత్తులు గూడఁ బఠించియో వినియో తరువాత నీయంతరాత్మసాహాయ్యము దీసికొనుము.

అ—అదిగో! తంటాతీసికొనివచ్చినారు. మాయంతరాత్మమార్గ మత్యంతసుఖప్రదమైన రాజమార్గము. అంతరాత్మమతమున కధ్యయన శ్రమ మక్కఱలేదండీ. ముండమోసినయుపనిషత్తులు! అవెవరికిఁ గావలెను? పోనిండు.

నే—తప్పు. అట్లనకు. పోనీ! ఆయుపనిషత్తే విను. ముండకోపనిషత్తు.

అ—(నవ్వుచు) తిట్టినను నన్నువదలనియుపనిషత్తుకూడ నున్నదండీ?

నే—అ ! ఇదిగో ప్లీడరువిను. ఈశకేన కఠపరీక్ష
ముండ మాండూక్య—

అనునంతలో నొకగోడుదుకప్ప యతనిపెత్తముమీఁదికెగిరి యొకదూఁకుదూఁకి నాకచ్చెలోఁ బడెను. అంతట నుభయుల మదరిపడి లేచితిమి. యామినీశ్యామ తలవిరియఁబోసికొని పైపైకివచ్చుచుండెను. "మనపుణ్యమాయని మండూకోపనిషత్తుగనుక నింతటితో మనలఁ బోనిచ్చినది గాని సర్పోపనిషత్తయినయెడల, నీచీఁకటిలో దిక్కుమాలినచావు చచ్చిపోదుము. నాపరాయి యుపయోగకరమో మీవోవతి యుపయోగకరమో యిప్పుడు చెప్పుఁ" డని నన్నుఁజూచి యతఁడు మందహాసముచేసెను.

అతఁడు నాయింటికి మఱునాఁడు భోజనమునకు వచ్చునట్లు, పరాయితీసి, పట్టుబట్టగాని పట్టుబట్టవలెనుగవను మఱియొకబట్టగాని ధరించి భుజించునట్లు, బొట్టుపెట్టుకొనునట్లు, పరిషేచనము తప్పకచేయునట్లు—నేను సంధ్యావందన మాపూఁటకు మానునట్లు, మానలేనియెడల నతనియెదుటఁగాక రహస్యముగాఁ జేసికొనునట్లు, దయ్యపుబొట్టు మాని వర్ణసేయమైన చుక్కబొట్టు పెట్టుకొనునట్లు, పరిషేచనమంత్ర మతఁడు మఱచిపోయినందున నలుగురునవ్వకుండ నేకకాలమున నేను బిగ్గరగా నామాటలు చెప్పుచుఁ బరిషేచించునట్లు, అతఁడు వచ్చినవాని వలెనే చెవులు గదలించి గోఁకుకొనుచు విస్తరిచుట్టు నీళ్లుద్రిప్పునట్లు—ఒడంబడిక చేసికొని యెవరిబసకు వారు వెళ్లితిమి.



శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# సింధుసందర్శనము:

అజీర్ణము పుట్టినది. దానికి మూలమేమో యెఱుఁగనుగాని, యజీర్ణమూలములైనయనేకవ్యాధులు బయలుదేఱినవి. రక్తము తగ్గనారంభించినది. శరీరము శుష్కించి నీరసింపమొదలుపెట్టినది. మూఁడునెలలక్రిందటివఱకెంతోప్రియములైనపదార్థము లిప్పుడు పరమాసహ్యములై చూచుతోడనే డోఁకుగలిగింపఁజొచ్చినవి. దృష్టిదుర్బలమై మసకలువాఱఁజొచ్చినది. కొంచెము చదివినను, కొంచె మాలోచించినను, తలతిరిగి, క్రిందఁబడుదునేమో యనుభీతి కలిగించుచుండెను. ఇంచుక పాఠము బాలురకుఁ జెప్పినచో, గుండె దడదడకొట్టుకొని నొప్పివెట్టి యాయాసము పుట్టించుచుండెను. కంఠస్వరము కంపించి హీనమగుచుండెను. ఇఁకఁ గుటుంభరివ్యాపార మెట్లుసాగును ?

ఏకాకి కింతయేడ్పేలయందురా? అట్లనకుఁడు. నేను సంతానములేనిబహుకుటుంబిని. ఇంటిలోఁ దండ్రులులేనిపిల్లలును, దల్లిలేనిపిల్లఁడును, మితార్జకులగుసోదరులును, ఇంతవఱకు నన్నాధారముచేసికొని యున్నారు.

" ఆత్మనస్తు కామాయసర్వం ప్రియంభవతి " అనుమీబృహదారణ్యకవాక్యమే నెమరునకుఁ దెచ్చుకొని మఱిప్రగల్భము లాడుదురేమో! నిజమే, కాని యొక్కపొట్ట కింతశ్రమపడనక్కఱలేదు. వాండ్రవలన నాకుఁ గలుగుసౌఖ్యముకంటె నాతోడ్పాటు తొలఁగుటచే వాండ్రికుఁ గలుగుకష్ట మెన్నోమడుఁగు లెక్కువ. ఇదియే నాచింతకుఁ గారణము.

ఈచిక్కుల్లోఁబోవుచుని మనస్సు పరిపరివిధములఁ జిక్కుపడుచుండె ను. ఆరోగ్యము తగ్గినకొలఁది అంతఃకరణము క్షోభపడుచుండెను. అంతఃకరణము కలఁతనొందినకొలఁది ఆరోగ్యము క్షీణించుచుండెను. ఔషధసేవ విడువక చేయుచుంటినిగాని గుణములేకపోయెను. ఇట్లుండఁ బ్రసిద్ధాంగ్లవైద్యు లిద్దఱు రోగముపరీక్షించి— " వీరికిది మనఃక్లేశము నఁ గలిగినది. చదువుమాని సముద్రప్రాంతమునకుఁ బోయి విశ్రాంతి తో నుండవలెను. సముద్రపుగాలియుఁ జక్కని విశ్రాంతియు నౌషధము లకంటె వీరికెక్కువమేలు చేయు " నని నొక్కిచెప్పిరి.

చదువు మానుకొనుచున్న సంతోషపడి చంకలుగొట్టుకొనుట కు నేను బాలుఁడను గానుగాని, యొప్పుకొనకతీఱక వారిమాట కొప్పు కొంటిని. ఇఁకఁ బనిచేసిన నాకారోగ్యభంగమును పిల్లలకు విద్యాభంగ మునువక్క వేఱుఖల ముండదుగదా !

రెండుమాసముల సెలవుకై శ్రీప్రభువువారి కర్జీయిచ్చుకొని వా రిని సందర్శించితిని: సెలవు దయచేయుటయే కాక యతిదయానూతక ము లగువచనములతో, వైద్యులు చెప్పినట్లు, సకలసద్గుణసముద్రులగు వారును, సముద్రసేవయే చేయుమనిరి. చిరకాలమునుండి జీతమొసఁ గుచు, అదనముగ సేవనియుఁ గైకొనకే, నాఋణవిముక్తికై వెనుక నొకసారి వేయిరూపాయలును మఱియొకసారి వేయిరూపాయలును దయచేసి సాయపడినప్రభూత్తంసము, నాప్రస్తుతస్థితిలోఁ బితృవాత్సల్య ముగఁబఱచు టేమియాశ్చర్యము ?

పిల్లలకుఁ జదువుచెప్పటమాని పూర్ణభృతితోనే యొకవారము గడపి, 31 వ అక్టోబరు సాయంకాలమున సెలవుపయోగపఱచుకొనుట కారంభించితిని. ముప్పదిసంవత్సరముల కధికముగా, నాలుగుస్థలము లందు, విద్యార్థులతోడను, సహోపాధ్యాయులతోడను గలసిమెలసి

యుండి, పాఠశాలలే యింట్లుగా భావించుకొనియున్న వాఁడనగుటచే వారినివిడుచుట అతికష్టమైనది. కన్నులు చెమ్మగిల్లినవి. కంఠము గద్గదమైనది. వారికి నట్లేమైనది. ఇది మనోదౌర్బల్యమువలనఁ గలుగునందురేమో! కలిగినఁ గలుగవచ్చునుగాని, అప్పుడనురాగమునకును, అంతరంగదౌర్బల్యమునకును, అవినాభావసంబంధము చెప్పవలసివచ్చును. ఎట్లైననేమి, పరస్పరశ్రేయోభిలాషలను దెల్పుమంగళవచనములతో మేమొకరినొకరు విడుకొంటిమి.

ఒకసహోపాధ్యాయుఁడును ఒకప్రియశిష్యుఁడును నాయందలి ప్రేమచే ముందు ఉప్పాడవచ్చి, అచటికరణమునకు మనసమాచారమును, అతిథిసత్కారపరాయణుఁడును అగు నొకయోగ్యగృహస్థునిసాహాయ్యమున సమస్తసదుపాయములుగల యొకపరిశుభ్రమైన బస యేర్పఱిచిరి.

3 వనవంబరు సోమవారమునఁ బెద్దలు పెట్టినముహూర్తమున బయలుదేఱి, శ్రీరాజావారు దయతోఁ బంపిన బండిలో పిఠాపురము నుండి సుఖముగా వచ్చి పగలు రెండుజాములకు బంగాళాలోఁ బ్రవేశించితిని.

వాసనాబలముచేఁగాఁబోలు, 'ఉప్పాడ' వ్యుత్పత్తి యేమైయుండు నను తలంపు మొదటఁ గలిగెను. సముద్ర మున్నదిగదా! ఉప్పసముద్రముదగ్గఱనున్న 'వాడ' 'ఉప్పాడ' కావచ్చునని మనస్సును సమాధానపెట్టుకొంటిని.

పరిశుభ్రమైనయిల్లు, ప్రక్కలఁ బచ్చనిపొలములును బచ్చికబయళ్లును, ఎదుట మహాసముద్రము, పీల్చుటకు దివ్యమైనగాలి—మనోరోగముల కింతకంటె మహౌషధము లేమున్నవి?

కాని నయనములకు నాసికకుఁ గలిగినసుఖము కర్ణములకుఁ గలుగలేదు. నేయిమేకలు విఱిగి క్రిందఁగూలినంతవిపరీతధ్వని యనుకొన

ము పుట్టుచుండఁగా వీనులకు విశ్రాంతియెక్కడ ?

క్లాసులో ఉపాధ్యాయుఁడు లేనప్పుడు పిల్లలుచేయురొదకంటెఁ బ్రపంచములో నెక్కువరొదయుండునా యనుమూఢాభిప్రాయముతో నున్ననాకిప్పుడు ప్రబోధోదయమైనది. ఆచప్పుడడఁచుట కనేకసాధనము లున్నవికాని యీమహాఘోష మాఁపుటకు మార్గమేమున్నది ? వార్ధి ఘోష వినలేనిబధిరుఁ డీప్రపంచమున నుండఁడని నిశ్చయించుకొంటిని.

"చదువుట, చెప్పుట, వ్రాయుట, ఆలోచించుట—ఇవిమాను కొనవలెను. లేదా, సాధ్యమైనంతవఱకు తగ్గించుకొనవలెను" అనికదా చికిత్సకులును, స్నేహితులును జెప్పినారు. తక్కిన వేపాట్లైనఁబడి య డఁచుకొనఁగలనుగాని, చివరది—చిత్తవృత్తినిరోధము—అది యెట్లు చేసికొనఁగలను ? సముద్రసన్నిధిని నాలుగురోజులు సంచరింపఁగానే శ మదమాదిసంపత్తి సంభవించునెడల నందఱును శ్రీశుకులేయగుదురు. మ్రింగి యజీర్ణము పోఁగొట్టుకొనుట కరఖులు దెచ్చితినిగాని, మనోనిగ్ర హమున కేమాత్రలును దీసికొనిరాలేదే ! ఏమిచేయుదును ?

సముద్రసమీపమునకుఁ బోయితిని. హోరెక్కువ యయ్యెను. గయ్యాళికాంతలవలెఁ దరంగము లొకటివెనుకనొకటి వచ్చి యిసుక పఱపుపైఁ బడి తలలు గొట్టుకొనుచుండెను. చెప్పువారెవరు ? వినువా రెవరు ? కంకరఱాలవలెఁ గావలసినన్ని కర్కటరాసులు గనఁబడినవికా ని యవియన్నియు నాకాలిచప్పుడు వినియో, నారాకగనియో గారడి వాని చేతివస్తువులవలె నిట్టె వానివానికన్నములలోఁ దూఱి మాయ మయ్యెను. ఆహారముకై యాకసమున వలయములు దిరుగుచున్నవిష్ణు వాహన మొక్కటియు, నేనును, గర్జించుచున్నకంధియుఁ దక్క మఱె వరును లేరు.

ఉదధిపై యూర్ములకంటె నాలోనుద్భవించిన యూహాపరంపర

లెక్కుడయ్యేను. బుజ్జి యుత్తబుజ్జిగా నుంచుకొనుమని వైద్యులు చెప్పిరి. కావునఁ బ్రభవించినభావములను బైకిఁగ్రక్కి యుత్తరములోఁబెట్టి 'ఆంధ్రసేవ' వారికిఁ బంపినయెడల నాకును వారికినిగూడ శ్రేయస్కరమనియెంచి యట్లు చేయఁదలఁచుకొంటిని. శిరోభార మెంతతగ్గిన నంత నాకుమంచిది. పత్రికాభార మెంతహెచ్చిన నంత వారికి మంచిది. ఈ నాతప్పు క్షమింపుఁడని వైద్యుల కనేకవందనము లర్పించుచున్నాను.

చెదలవలె జనించినయూహ లన్నియు సమగ్రముగా వ్రాయుట నాతరముగాదు. కొన్నియే యిట నుటంకించుచున్నాను. ప్రసంగరూపముగా వ్రాసిన విస్పష్టముగానుండునని యట్లు చేయుచున్నాను.

అనివార్యమైన మహారావముతోఁ బొంగి పొరలుచున్నమహోదధినిజూచి చేతులుజోడించి "తాతా! నమస్కార" మంటిని. ఆమహాఘోషములో నతఁ డేమనెనో నాకు వినఁబడలేదు. (కొంత సేపటికి)

సముద్రుఁడు—ఇదిగో! ఉప్పాడ కేదోక్రొత్త మొగము వచ్చినట్లున్నది! పాగా, పట్టంగరకా, మెడచుట్టు వన్నెవన్నెలమఫ్లరు—అన్ని బాగుగనే యున్నవిగాని, జపానుసరకులాగున అంతస్సారము లేనట్లున్నదే! నాయనా! ఏమి యిచటికివచ్చినావు?

నేను—ఏమిలేదుతాతా! మాప్రభువుగారిమామవని దర్శనము చేయుటకు వచ్చినాను.

స—(అలలయట్టహాసముతో) మీప్రభువుగారిమామగారియూరు నూజవీడు. వారికి మాకు చాలదూరము. పతకముకోసమ్ము పాదము తడవుచున్నావేమి?

నే—ఆప్రభువుగారుకారు! వారికి, నీకు, నాకు, అందఱకుఁ బ్రభువైన రామప్రభువుగారిమాట నేఁజెప్పినది.

స—ఓహో! (అని పెద్దహోరుతో నింతనుఁగు నాకాళ్లపైఁ

బడవేసెను.)

నే—తాతా! ఇట్లు తేపుడులు గ్రక్కుకొనుచున్నావు—నీకును అజీర్ణమేనా యేమి?

స—అజీర్ణముకాదురా! అప్పటిగాథ తలఁచుకొనఁగానే యెడలుప్పొంగి గుండె నీరగుచున్నది. ఇవిగో అశ్రుపాద్యములు—గూరుచుండుము. (అని ముఖమువలనకుఁ జిందిన శ్లోకయుల నాపాదములపై విఱుగఁగొట్టెను.)

నే—(ఉమ్మితుంపర యుమియుచు) తాతా! వేసఁగిలో దగగొన్నవారి కేమియాతిథ్యమిచ్చెదవో నాకుఁ దెలియకున్నది!

స—హాఁ! హాఁ! మంచినీళ్లిచ్చుపని మాయింటియాబిడలది కాని వాదికాదు.

నే—తాతగారూ! మీవయసెంత?

స—ఏమో! ఎవరెఱుఁగుదురు? నాకు జ్ఞప్తిలో లేదు. అట్లడుగుచున్నావేమి?

నే—తలనెరసిన తాతలకుఁగూడఁ దల్పసుఖవాంఛ తప్పదా యేమి? అవ్వలెందఱున్నారు?

స—ఆకస్మికముగా అడిగినప్రశ్నకు సిద్ధమైనప్రత్యుత్తరము చెప్పుట కష్టము. ఉన్నారు—ఏమో—దేశమున కొకర్తె—ఇద్దఱు—ముగ్గురుచొప్పున—హిందుసుందరులు కొందఱు, చీనాజాణలు కొందఱు, ఆంగ్లేయాంగనలు కొందఱు, ఫ్రెంచిప్రేయసులు కొందఱు, రష్యారమణులు కొందఱు, జర్మనీశ్యామలు కొందఱు, అమెరికాయలివేణులు కొందఱు. ఇట్లే అక్కడక్కడ వెదచల్లినట్లున్నారు. ఏముండుట!

నే—తాతా! వీరు చాలరా యేమి?

స—చాలకపోయినఁ జేయునదేమున్నది? సరసులఁట! సరసులు!

సరసులు ! కొందఱు వారికడకుఁ బోవుచున్నారఁట ! ఏమిటనము బొవ్వ కొనుచున్నారో తెలియదు. (సింహగర్జనములతో నా[illegible] ఒడ్డుమీఁద బడవేసెను.)

నే—పోనీ ! తాతా ! ఇంతకోపమేల? బిక్కు[illegible]నకు నీకు భయపడి వారిని గట్టుకొన్నావేమో ! ఉన్న అప్పులు[illegible] నాతక్షేపము గాదా ! వారు నీకు విధేయులుగ నున్నారుగద ?

స—ఆ ! దానికేమియు సందేహములేదు. మహాపతిభక్తితత్పరలు—నాయొద్దపోకుగులు చూచినావా—బహుముఖనిత్యమధురచుంబనానందప్రదలు—అంగనాంగభేదములతో నానందరసభేదములుగూడ నున్నవి—స్థూలాంగులు, తన్వంగులు, కుటిలగమనలు, ఋజుసంచారిణులు, వేగవతులు, మందగామినులు, నానావర్ణపరవర్ణినులు—సరే—కాని సంసారసుఖములకు సందేది! పాటులేదు మాటులేదుగద! మీరందఱు సాగరసంగమస్నానములని పేరుపెట్టుకొనివచ్చి మాకాసంతగుట్టు బట్టబయలు చేయుదురుగదా—సర్వాంగాలింగనము లేనియూ తురకంఠాశ్లేషములతో ఆశ తెట్టితీఱును నాయనా ! (అని కోటిపాములు బుసగొట్టినంత నిట్టూర్పూర్చెను.)

నే—బహుభార్యాసంతతపోషణముచేతనా యిట్లు నిత్యవృష్టిలోనుండి నింగి కెగురుచున్నావు ?

స—భార్యాభర్త లన్యోన్యపోషకులుగారా ! నేనును శక్తివంచనలేకుండ వారియోగక్షేమములు చూచుచునే యున్నాను—చూడు—స్త్రీలు అబలలు. కొందఱు ఎండకాలములోను, కొందఱు శీతకాలములోను వాడి కృశింతురు. చిక్కినభార్యలకుఁ జిక్కుదన మెక్కుడరా ! అప్పుడు దుస్స్వరస్వరసుచు నేఁ గొంతజీవనము గొల్పఁగా, వారు బలిసి కులుకుచు మఱల వచ్చి నాకౌఁగిటి కంటుదురు. చైత్రవైశాఖములలో

సతులు దారపుఁబోఁచలయి కొందఱు నాదాఁక రాలేక దారిలోనే యీ డఁగిపోదురు. పాపము! ఎంతకష్ట మెంతకష్టము! (అనిబోరునవడ్చెను.)

నే—తాతగారూ! ప్రబలాజీర్ణరోగముతో నేబాధపడుచుండఁగా సజీవసతీస్మరణముతో మీ రేడ్చుచున్నా రా?

స—నీకు భార్యలేదా నాయనా?

నే—(ప్రత్యుత్తరమీయక రెండుప్పుఁగన్నీటిబిందువు లాయన మీఁదఁ బడవైచి కన్నులొత్తుకొంటిని.)

స—పాపము! పాపము! పోనీలే! ఈవిషయము కట్టిపెట్టియింకొకవిషయముఁగూర్చి మాటలాడుదము—నీకజీర్ణమా, నాయనా! మొన్న మొన్నటివాఁడవు—ఏదీ మొగమిటుచూపు—వెనుక నెప్పుడో నిన్నుఁజూచిన ట్లున్నదిరా!

నే—ఔనుతాతా! ఇరువదిరెం డిరువదిమూఁడేండ్లక్రిందట నొకసారి నీదర్శనము చేసినాను—సోదరులతోను మిత్రులతోను స్నానమునకు వచ్చినాను—అప్పటిస్థితి వేఱు, ఇప్పటిస్థితి వేఱు.

స—ఔనౌను. ఆబల్లవఱుపుపొగరుటొమ్ము, ఆనల్లమీసములు, ఆఉంగరపుగిరదాలు—ఇప్పుడు జ్ఞప్తికివచ్చినవి. ఒకఅఱగంటవఱకు నాతో నవ్వుచుఁ ద్రేలుచు స్నానముచేసి వెళ్లితివి. అట్టివాఁడ వెట్లైనావురా! పాపము! కాలముచే మార్పుచెందనివాఁడను నేనొక్కఁడనున్నానేమోగాని యితరులెవ్వరును లేరునాయనా! నాకున్నమార్పులు నాకున్నవిసుమా! దినమునకు రెండుమార్లు పొంగు, రెండుమార్లు క్రుంగు. ఒకచోటఁ జిక్కుట, మఱియొకచోట బలియుట. వెనుక నీవు స్నానము చేసినప్పు డెంతవెనుకనుంటినో యెఱుఁగుదువా? ఎవరికష్టసుఖములు వారివి. వాని కేమిలే! నీకజీర్ణ మేమి?

నే—కారణము నాకును దెలియదుతాతా! చిరకాల మఱచి

చెప్పుటచేతను, మనస్సును క్లేశపెట్టి ముప్పదియేండ్లు ప్రధానబోధకత్వము చేయుటచేతను, నీకిప్పటికి—ఏఁబదిమూఁడేండ్లకు—జఠరాగ్ని మందమయి అజీర్ణము కలిగినదని ప్రఖ్యాతపాశ్చాత్యవైద్యులు చెప్పి సెలవుపుచ్చుకొని నన్ను నీదగ్గఱకుఁ బొమ్మన్నారు.

న—అబ్బ! ఏఁబదిమూఁడేండ్లు! నావయసులో నేఁబదిమూఁడేండ్లేమూల! కన్నులు దెఱవనికూనవు! బోధకుఁడవేమి! బోధకుఁడవు! ఏపాటియుచ్చైస్స్వరముతో నెంతెంత బోధించినావునాయనా! నాస్వరముకంటె నెక్కువస్వరమా! ముప్పదియేండ్లపనికే, మూలఁబడి సెలవుపుచ్చుకొని వచ్చితివి! ఇంతకాలము బోధకవృత్తిలో నున్న నే నేప్రభువుకొద్ద సెలవుపుచ్చుకొని యేరేవుచేరను బాబూ!

నే—తాతా! నీతోసాటి నంటినా? మాప్రస్తుతకాలపుమానవులలో నేఁజేసినపని తక్కువగ్గాదని వారువీరును జెప్పినారు. అదిగాక, యొకటిరెండుపుస్తకములుగూడ వ్రాసినాను. అవియు బుద్ధివినియోగపఱిచి వ్రాసినవే!

న—(దయ్యపునవ్వుతో) అబ్బా! గ్రంథకర్తవుగూడనా! ఏను బడాయిరా! నే నిన్నిగ్రంథములు రచియించినను, గాసంతయజీర్ణమైన రాలేదే! అప్పుడే ఉపాధ్యాయులుగారుప్పాడకును, గ్రంథకర్తగారు సింధుదర్శనమునకును దయచేసినారేమి?

నే—(ఆఁగనికోపముతో స్వగతముగా) ఏమి! ఈముసలివాని పొగరుఁబోతుదనము! ఊరకున్నకొలఁది నుప్పరమున కెగసి యెగతాళి చేయుచున్నాఁడే! (ప్రకాశముగా) తాతా! దురుసుమాటలు దురుషు మాటలతోఁగాని తొలఁగవు. బొమ్మజెముడునలెఁ బ్రపంచమంతయు నలముకొనియుండిన నుండువుగాక! బ్రహ్మకున్నయాయువు నీకును నుండునుగాక! భగవంతుఁడు నీకిచ్చినశక్తి యుపయోగపఱిచి నీవు

పనిచేయుచున్నావు. నాకిచ్చినస్వల్పబుద్ధి యుపయోగపఱచి నేను బని చేసినాను. రుజాపీడితుఁడ నైనానని జాలిపడి మారాజుగారు నాకుసెల విచ్చినారు. నీపుట్టి యేమిమునిఁగినది ? ఆరోగ్యదాయి వనుప్రతిష్ఠ య ర్హముగానో నేతిబీఱకాయరీతిగానో నీకు వచ్చినదిగనుకఁజూడవచ్చితిని. అంతమాత్రమున నన్నింత చులుకఁజేసెదవా ? పడవలు బ్రద్దలుకొట్టు ట, ఊళ్లుముంచి కొంపలు గూలఁదన్నుట, పంటభూము లుప్పుపఱ్ఱలు చేయుట, దయ్యపుటలపులతో నిద్రపట్టనీయకుండుట, అన్నిటికంటె ముఖ్యముగా ముప్ప్రిద్దులను, ముసలవ్వల కుప్పుముద్దులుపెట్టుచు, వా రితో చేరలాటలాడుకొనుచుండుట, ఈమహాపరోపకారకృత్యములుగాక తమరుచేయు బోధనకృత్యములేవో, రచియించినగ్రంథములేవో కొం చెము సెలవిండు. వినెదను.

స—(పిరంగిపగిలినంత పెద్దనవ్వుతో) ఓరిపిడుగా ! కాసంత దాని కెంతబక్కకోపము తెచ్చుకొని పడఁదిట్టితివిరా ! నాబోధనకృత్యములు గ్రంథములు కావలసినఁ జెప్పెదను. శాంతముగావిను.

నే—తాతా ! కుఱ్ఱవానితప్పులును నోటితొందరయు క్షమింప వలెను. దయచేసి చెప్పు. సావధానచిత్తుఁడనై వినెదను.

స—నాప్రతితరంగము—ప్రతిజలకణము—ఒకమహాగ్రంథము.

నే—తాతా ! నీతత్త్వవాక్యములు నాతల కెక్కుటలేదు—అర్థ మగుటలేదు.

స—అది నీలోపముగాని నాలోపముగాదు—నీగౌరాంగచరిత్ర నైకల్సన్‌దొరగారి కర్థమగునా ?

నే—తెలుఁగురానివారి కదెట్లు తెలియును ?

స—నాభాష రానివారికి నాగ్రంథము లెట్లు తెలియును ?

నే—నీభాష పఠించినవారీలోకములో నెవరైన నున్నారా ?

స—ఆ! అక్కడక్కడ. శ్రీరామకృష్ణపరమహంసులు, శ్రీరవీంద్రనాథటాగూరు మొదలగువారు. వారిబోధవచనము లన్నియు నాగ్రంథములనుండి తీసి చెప్పినవే!

నే—నావంటివారికి గతియేమిమఱి?. వారి కేమిబోధింతువు?.

స—(తాటిచెట్టుపొడుగున లేచిపడి) నన్నుఁజూచినపిదప నాస్తికుఁడవై యుండఁగలవా?

నే—(స్వ) ఓరినీమిడిసిపాటుగూల! (ప్ర) తాతా! నాకు నవ్వు వచ్చుచున్నది! నిన్నుఁ జూడకముందుకూడ నేను నాస్తికుఁడనుగానే! నాదగ్గఱ రమారమి యిరువదియేండ్లనుండి యొకతులసితావళమున్నది. ఇప్పుడు నిత్యమష్టోత్తరశతరామనామములు దానిమీఁద జపించుకొనుచున్నాను.

స—ఇంకేమీ! గొప్పవారిప్రాపే దొరకినది—తారకనామము దగ్గఱఁబెట్టుకొన్నావురా! ఇఁక మనగొడవలోనికి దిగుదము. సృష్టియెప్పుడు సృష్టికర్తగుణములను బ్రకటించునుగదా!

నే—ఔనుతాతా! నీవే యింతబలశాలివిగా నుండఁగా నిన్ను సృజించినవాఁడు సర్వశక్తుఁడుగాఁడా!

స—ఆమాట నిత్యము గొంతుచించుకొని నేను బోధించుచున్నానా లేదా?

నే—బోధించుచున్నమాట వాస్తవమే!

స—నేననవేల? నాశక్తినిగూర్చి, నరశక్తినిగూర్చి, బైరన్మహాకవివ్రాసినపంక్తు లెఱుఁగుదువా? బోధకుఁడవుగాదు, బోధకుఁడవు!

నే—(స్వ) ఏమియాత్మస్తుతి! ఏమియధిక్షేపణము! (ప్ర) ఎఱుఁగుదును. నీవు మొగము ముడుతలులేనిముసలివాఁడ వనిచెప్పినవాఁడే కాఁదా! కాని భరతవర్షమువారితో బైరన్మహాకవి ప్రశంసయేల?

స—ఓహో! నీస్వదేశభక్తి చాలదూర మెగఁబ్రాఁకినట్లున్నదే! మహాకవి, మహాప్రకృతిరహస్యవేత్త, మహాభక్తుఁడు, మహాజ్ఞాని వీరొకదేశమువారు, ఒకజాతివారు కారు—అన్నిదేశములు వారివే—ఎల్లరు—పిపీలికాదిబ్రహ్మపర్యంతము—వారివారే! అదిగాక బైరన్నుట యెత్తుకొనకుండ నీవుండఁగలవుగాని నేనెట్లుండఁగలను?

నే—ఏమి?

స—ఏమో గ్రహించుకొనలేవా? ఆ అత్తకు—ఇంగ్లండత్తకుఁ గోపమురాదా? కొమ్ముప్రియురాలు మూతిబిగఁబట్టదా?

నే—ఓ! మహాకాముకప్రపంచ చక్రవర్తివి! ఇఁక నేను వెళ్ల వచ్చునా?

స—ఏమిరా! అంతతొందర! చెప్పనీయవేమి! భూసృష్టికంటె నాలోనిసృష్టి యెక్కుడని యెఱుఁగుదువా! ఉపాధ్యాయుఁడవుగదా?

నే—ఆ!

స—నామీఁద ఎన్నిపడవలు, ఎన్నిస్టీమర్లు, ఎంతప్రజాసంఘము, ఎంతెంత-ఎన్నెన్ని-సరకులు, దూరదూరములనుండివచ్చి, దేశములు గానిదేశములకు నిత్యము పోవుచున్నవో తెలియునా? ఎంతబరువు మోయుచున్నానో యెఱుఁగుదువా? (అని యొకరాకాసిభుజాస్ఫాలనము చేసెను.)

నే—(ఉలికిపడి మరల మనసుకుదురుపఱుచుకొని) ఔనుగాని, మొన్నమొన్నటివఱకు నీలోపలనుండి డాఁగిపోయి నౌకాధ్వంసకము, లెన్నియోడలు ముంచి యెన్నిప్రాణులను గంగలోఁ గలిపెనో యది మఱచిపోయినావు. అల్లఉత్తరమున నెన్నిజనాకీర్ణములైననావలను నీమీఁది హిమశైలములు (Icebergs) వచ్చి వెలగచెక్కలను నొక్కినట్టు నొక్కి పప్పుపప్పుచేసినవో మఱచినావు?

స—ఓరిచీపుగా! నమమానమమెం జటుక్కునం బొడుచుచుందు వురా! అది మీమానవజాతి యజాగ్రత్త, బుద్ధిమాంద్యము, రాజ్య తృష్ణాకార్యఫలము! తెలిసినదా? (అని యొకతుల మీఁదఁ బక పైచెను.)

నే—తెలిసినది! నీపుణ్యము! నీయంతబలవంతుఁడు, పరోపకారి, యీప్రపంచములో భగవంతుఁడుదక్క మతెవరు లేరు, లేరు, లేరు-ముమ్మాటికిలేరు—చాలునా? సృష్టిలోఁ జెదుగంతయు నిశరుబుద్ధి, మంచియంతయు నీది—సరేనా? కాని ప్రారబ్ధవశమున ఉష్ణనీరయి నది—ఆలగస్త్య—

స—ఓరినీపుణ్యమురా! నాగుట్టు బయటఁబెట్టకురా బాబూ-ఆఁగు!

నే—నేమటి వెళ్లవచ్చునా?

స—ఈమాట యొకటియు విని మటివెళ్లుము. నాకంటె బలవత్తరమైనది సృష్టిలో నొక్కటిమాత్రి మున్నది. అది పంచభూతములను బానిసలుగఁ జేసికొనఁగలిగిన మీమానవబుద్ధి. అది హెచ్చినకొలఁది నీవు పేర్కొనిన నాపలనికష్టనష్టము లంతరించును. ఇది పరమరహస్యము. (అని చెవిలోఁ జెప్పెను.)

నే—అమ్మ! నీలటీపరహస్యముగూల! చెవి బ్రద్దలయినది తాతా!

స—ఇఁక నీవు వెళ్లవచ్చును.

నే—నాఆరోగ్యముమాట యేమిచెప్పెదవుతాతా!

స—అందఱకు ఇచ్చుఆరోగ్యము నీకేలయీయఁగూడదు? అందులో అల్లుఁడుగారినవుకరవు, మరమేకై వచ్చి కూరుచుంటివి—ఈయు కతప్పునా యేమి? మాఅల్లుఁడంతదొంగ లేఁడుసుమా! అన్ని అతఁడు

చేసి నామీఁదను వైద్యులమీఁదను ఆమంచిచెడ్డలు వేయుచుండును. అతనిప్రియభృత్యుఁడవు నీకేమిభయము?—ఇప్పు డేలాగుననున్న దేమి?

నే—కొంచెము జలుబుచేసినది తాతా!

స—(నవ్వుచు) సంసారము పొరుగూరిలోఁ బెట్టినావు. జలుబు త్వరగానే వదలునులే. బంగాళాలో నేనా బస?

నే—ఔనుతాతా!

స—సరే—మనకెప్పుడు తాతమనుమలవరుస తప్పదు-వెళ్లు-

నే—నమస్కారము తాతగారూ! (అని పోవుచుండఁగా మఱల మహాధ్వనితోఁ బిలిచి)

స—నాయావచ్ఛక్తియు వినియోగపఱిచి నిన్ను బాగుచేసెదను. నేఁ జెప్పినట్లుమాత్రము చేయుము. నన్నెపుడు చూచి యానందించుచుండుము. చదువు, వ్రాఁత, ఆలోచన మానుకొనుము. నాగాలి పీల్చుచుండుము. నాకుఁ బున్నమకును అమావాస్యకును బిచ్చికళ లెత్తుచుండునులే—కార్తికమాసములో మఱియు గంగవెఱ్ఱులు. వానికేమియు భయపడకుము. విశేషముగా గాలివీచురాత్రిలలోఁ దలుపులు కొంచెము మూసికొని వెచ్చగాఁ బరుండుము—వెళ్లు—శుభమస్తు.

అంతట సర్కసులోవలె ఉడాయిలతో నొకటివెనుక నొకటివచ్చి తీరమున మొగ్గలువేయుతరంగములకు మఱల నమస్కరించి నేబస కేగితిని.

ఉప్పాడ.
6-11-1919.

# గ్రాంథికభాష—గ్రామ్యభాష.

ఆంధ్రసోదరులారా!

సాంప్రదాయముగఁ బుస్తకములలో వ్రాయుచున్న తెలుఁగు తెలియుటలేదు. పిల్లలకుఁ జాల గష్టముగనున్నది. ఇంగ్లీషుభాషలో బాలకులు చదువుటకు ననుకూలములగు తేలికపుస్తకము లనేకములు న్నవి. మనభాషలో లేవు. కనుక గ్రామ్యభాషలో మనమందఱ మిం డ్లలోను వీథులలోను వాడుకగా మాటాడుకొనుచున్న సులభమైన తె లుఁగులో గ్రంథములు వ్రాసినయెడలఁ గడునుపయోగకరమని మన లోఁగొందఱు, సదుద్దేశముతోనే కానిండు, బహిరంగముగ వాదించు చున్నారు. కేవలవాదమేకాదు. వాదములుపుట్టుటకుఁ గొంతకాలము పూర్వమే, పాఠశాలలలో నీ "నవీనాంధ్రము" నుపయోగపఱచుట కు విద్యాధికారుల యనుమతినిగూడఁ బొందియున్నారు.

ఇట్టిమార్పు బడులలోనికి వచ్చుననికాని, వచ్చెననికాని, కొంత కాలమువఱకుఁ దెలుఁగువారిలో విద్యావంతులుగూడ ననేకులెఱుఁగరు. ఎఱుఁగకపోవుటకుఁ గారణము భగవంతునికెఱుక!

వెనుకటివి తవ్వుకొనిచింతించుట నిష్ప్రయోజనము. వచ్చినదే మో వచ్చినది. అని యూరకుండుట తగదు. అది మంచికివచ్చెనో చెడ్డకువచ్చెనో బాగుగ విమర్శించి భాష చక్కఁబఱుచుకొనుట తెలుఁ గువారనిపించుకొను వారికెల్లర కవశ్యకర్తవ్యము.

గ్రంథములు సులభముగా వ్రాయుటయుఁ బుస్తకపఠనమందు బాలురకష్టములు తగ్గింపఁ బ్రయత్నించుటయు నందఱకు సమ్మతమే.

కాని యీసౌకర్యసాధనము లేవి? ఇక్కడ నేయభిప్రాయభేదము గలి
గినది.

"నవీనాంధ్ర" పక్షమువారిటు చెప్పుచుండగ నిట్లు చెప్పెదరు. మీ
కు వ్యాకరణములతోఁ బనిశక్తి లేదు. చిరకాలసంప్రదాయములజోలి
యు నక్కఱలేదు. ఇది సాధువా యసాధువా యను విచారణతోడ
ను బనిలేదు. నాగరకజను లెట్లు మాటలాడుకొనెదరో యట్లు వ్రాయుఁ
డు—అనుచున్నారు.

"అట్లైనిఁ గొన్నాళ్లలోఁ బూర్వరచిత సద్గ్రంథములన్నియు
నరణ్యమయములై నశించునే!" యన "నైననేమి? జాతస్య మరణం
ధ్రువమ్—ముసలివారెన్నాళ్లు బ్రతుకుదు" రందురు. "అయ్యయ్యో!
నియమసహితమై, వ్యాకరణబద్ధమై, బహుజనచిరాదరణీయమై, యా
నందదాయకమై, నీతిబోధకమై, యిహపరసాధనమై యొప్పుచున్న భాష
విడనాడి మీ క్రొత్త తెనుఁగు నెట్లు స్వీకరింతు" మన—బద్ధమగుటచేత
నే వృద్ధిగాంచుటలేదు. మీయజ్ఞానముచేతనే యాదరణీయమైనది.
ఆనందదాయకము, నీతిబోధకము, ఇహపరసాధనము, ఈమాటలన్ని
యుఁ గల్లలు. అని సాహసించి చెప్పుచున్నారు. "కాలుజారిపడితిరి
కదా! సాహెబుగారూ!" అని జాలిపడి యడిగినప్పుడు, సాహెబుగారి
చ్చిన ప్రత్యుత్తరమువంటి యాగ్రహసూచకములగు మాటలుకూడ
నప్పుడప్పుడు వెలువడుచున్నవి.

ఇట్టిస్థితిలో సంప్రదాయసిద్ధమై, యుక్తియుక్తమై, యనుభవావి
రుద్ధమైన "సబబు" లు మనవారికి నివేదించుకొనుటకంటె సాధ్యాం
తరములేదు. "నాయనలారా! మీయుద్దేశము మంచిదేకాని, సాధన
సామగ్రి మంచిదికాదు. నూనెపోసి యగ్నిజ్వాల లార్పఁదలపెట్టుచున్నా
రు. వ్రతముచెడుటయేకాని ఫలముదక్కదు. దేశమంతయుఁ బరికించి

చూచిన మీ "నవీనాంధ్రము" ఇదివఱలో నుపయోగపడుచున్న వ్యాకరణనిబద్ధమైన భాషకంటె నెక్కువ సులభముకాద" ని విన్నవించుకొనవలయును. అట్లు చేసికొనినపిమ్మటనైన వారంగీకరింతురా యందురా? అది వారిచిత్తము. మనభాగ్యము. కాని పూర్వభాషాగ్రంథగౌరవమును బండితసమాదరణమును ఇంచుకంతయు లేనివారి "గొడ్డటిపెట్టు" లకు వెఱచి వెనుదీయుటయు, నేది యెట్లుపోయిన మనకేమి యని యుదాసీనభావముఁ దాల్చుటయు మాత్రము దేశభాషాభిమానుల లక్షణముగాదు.

కఠినముగా వచనకావ్యములు వ్రాయుట గొప్పయనునభిప్రాయమునఁ గొంతకాల మట్లువ్రాసిరి. అదినిజమే. కాని యాకాలముపోయినది. సులభగ్రంథము లిప్పుడనేకములు వ్రాయుచున్నారు. వ్రాయనున్నారు, "ఆర్యకథానిధి" మొదలగు చిన్నపుస్తకములు పిల్లవాండ్రకతిసులభముగఁ దెలియునట్లున్నవి. లేవని పరమశత్రువైనను నన లేఁడు. వ్యాకరణోల్లంఘనము చేయకుండ సుబోధములగు పుస్తకములువ్రాయుట యసాధ్యముకాదనుట కివియే లక్ష్యములు.

కేవలమసంప్రదాయముగ వ్రాసిన యొకటిరెండుగ్రామ్యగ్రంథములను సౌలభ్యములోఁగాని శ్రావ్యతలోఁగాని పైవాని కించుకయు సరిరావు. ఈమాట చదువువారికిని అచ్చుకూర్చువారికిని గూడ ననుభవమునకు వచ్చుచున్నది:

కనుక మిత్రులారా! మనకు గ్రాంథికభాషామాతచేసిన నెబ్బరమేదియో "నవీనాంధ్రము" చేయనున్న మేలేదియో, త్వరగమేలుకొని, విమర్శించిచూచి, మంచిదిగ్రహించి చెడ్డది విసర్జింపుఁడు.

ఇప్పటిమాట కేమిలెండు! ముందుముందు భాష బాగుపడును. ఇటుకగోడఁ గట్టుపూర్వము మట్టిగోడ పడఁగొట్టకతప్పదు. ఎట్టిమహా

ప్రశస్త సులభగ్రంథములు వెలువడునో మీరో మీయనంతరపుసం తానమువారో తప్పకచూతురు. అప్పుడు బ్రాహ్మణాద్యాచండాలము, ఆబాలవృద్ధపర్యంతము గ్రంథస్థవిషయములు కరతలామలకములగును. అశ్రమతో నింతలాభము మనకుఁగలుగును - అనుబెల్లిమాటలను వమ్మి భాష పరశురామప్రీతి చేయుచుఁడు.

"పనివడిమబ్బులో • పలినీళ్లునమ్మి
దొననీళ్లు తెగఁగొట్టు • దురవెత్తులైన ?"

అనునార్యోక్తినిమాత్రము జ్ఞప్తిలోనుంచుకొనుఁడు. మబ్బులో నీళ్లుండుటయైన యథార్థముగాని వీరుచూపించు భావిభాషాజీవనము మృగతృష్ణాప్రాయము. "మాత" యన నొక్కమాతయేయుండును గాని రెండవమాత యెప్పుడునుండదు. ఉండిననామెసవతి తల్లియగును. సవతితల్లిప్రేమ మెట్టిదో యెల్లరకు విశదమే !

భాష యనాగరకస్థితిలో బహూచ్చారణభేదమై, నియమహీన మై, నిర్గ్రంథమై యున్నప్పుడు ఎవ్వరేని బుద్ధిమంతులు బయలుదేఱి, యాభాష సంస్కరించి, కొన్నినియమము లేర్పఱచుకొని, తన్నియ మానుసారముగ గ్రంథములు వ్రాయుదురు. అట్టిగ్రంథములును వాని లోని వ్యాకరణనియమములును రాఁబోవు గ్రంథకర్తలకు మార్గదర్శకములగును.

కాలానుక్రమముగ, స్వాభావికముగఁ గొన్నిమార్పు లుత్తమ గ్రంథకర్తృప్రయోగకారణమున భాషలోఁగలిగిన, నామార్పులననుసరిం చి వ్యాకరణము లించుకించుక మాఱుచుండును. అంతేకాని సౌలభ్య వ్యాజమునను దదితరకారణములచేతను అత్యల్పసంఖ్యాకులు పట్టుదల తో వేనవేలు వ్యావహారికరూపములు అసంప్రదాయముగ నొక్కసారి గ్రాంథికభాషలోఁ జొరఁబెట్టఁ బ్రయత్నించుట విపరీతకృత్యము !—

అస్వాభావికము ! హాస్యాస్పదము !

వచ్చేను—వొచ్చా—వొస్తా—యేఁవంటావు? వాళ్లూ వీళ్లూ కూడావుంటార్స—బహోశావున్నాడు—మనోమలికతలు—మొత్తమ్మీద సూద్దరాళ్లు పొలాల్లోనే వుణ్ణాదింటారు. మంఘిరసకందాయప్పట్టులో వచ్చి ఆటథంసంచేశాడు—మూభాగే—కాలేజీలో జాయిన్నయి నాలుగుటరమ్మా చదివాగాని సర్టిఫికెట్టు యిచ్చారుగారు—ఒహాటనుకుంటే హోటయింది—నాప్రారబ్ధం.

ఇటువంటివి వేలకొలఁదిగ ఉత్తమజాతులలోవారే మాటాడుకొనుచున్నారనుట సత్యము. ఇవన్నియుఁ బుస్తకములలోఁ జేర్పవచ్చునా? ఈపదప్రత్యయ వికారరూపములు గ్రాహ్యములనుమనెదరా? వీనికన్నిటికి వ్యాకరణసూత్రములు కల్పింపవలయునా? అట్లుచేసినఁ గ్రొత్తవ్యాకరణము సృష్టించుట యగునుగాని ప్రాఁతవ్యాకరణమును సంస్కరించుటకాదే! ఈవిపరీతవాంఛ "ఈచెఱువంతే కల్లైన బాగుగ నుండును" అన్నయసాధారణ మద్యపానాసక్తుని యభిలాషవంటిది గాని వేఱుకాదే! ఇట్టియాతురసంస్కరణ మేదేశముననైన నేభాష లోనైన నెన్నఁడైన జరిగినట్లు చెప్పఁగలరా?

శిలాశాసనములలోను "అర్జీ"లు మొదలగువ్యవహారపత్రములలోను, మెట్టవేదాంతపు ముష్టిగీతములలోను, గొల్లసుద్దులలోను, బురాణాదిపవిత్రగ్రంథములను వాగ్రూపమున జనసామాన్యమునకు బోధించునప్పుడును, వ్యావహారికభాషయే యుపయోగింపఁబడినట్లు నిదర్శనములున్నవి. అవి యిప్పటికిఁ గనుఁగొనఁగలిగితిమి! దీనికేమనెదరని వికసితవదనారవిందులై యుపన్యాసభవనములందనుచున్నారు. కాని యీసత్యమునుద్రవ్వి పైకిలాగుట కింతశ్రమయేలో బోధపడకున్నది.

మేళములో గణికనుజూచి "యీామెయొద్దఁ గొంచెము కళంకముగల" దని సాముద్రికశాస్త్రజ్ఞుఁడు చెప్పినట్లున్నది. ఇప్పటికి నట్లే జరుగుచున్న దే! అట్లుకూడదని యెవ్వరు చెప్పుటలేదే! చెప్పలేరే!

బడులలోనేర్పుభాష, నేర్పుటకు శక్యమైన యర్థమైనభాష, పిల్లలచేవ్రాయించుభాష, శాస్త్రోపయుక్తములగు నుత్తమగ్రంథములు వ్రాయునప్పుడుపయోగింపనగుభాష—ఈభాషమాత్ర మెప్పటివలెనే వ్యాకరణానుబద్ధమై యుండవలెఁగాని, స్వచ్ఛందమై, నియమశూన్యమై, జిల్లాకొక్కటియుఁ బల్లెకొక్కటియు నుండఁగూడదని ప్రాజ్ఞులనుచున్నారు. అట్లనుటతప్పా?

నియమరహితమైన వ్యావహారికభాషను వ్యాకరణయుక్తముగఁ జేయుట యెంతయసాధ్యమును బరిహాసపాత్రమునో గ్రాంథికభాష నొక్కమాటుగ నమితవ్యావహారికరూపసంకులముగఁ జేసి "యభివృద్ధి" పఱుచుట యంతయసాధ్యమును హాస్యాస్పదమునుగాదా?

మేమట్లుచెప్పితిమా? కొంచెముకొంచెముగఁ మేమిఁక వ్రాయఁబోవు నుద్గ్రంథముల ననుసరించి భాషమార్చుకొనుఁడని బోధింతుమన్న నొకపుట్టిమునుకవచ్చును. "కొనఁబోవుగేదె పెట్టఁబోవుబచ్చలిపాదు మేయును". అకారణకలహములును అనావశ్యకభాషాసాంకర్యమును దటస్థించును. ప్రస్తుతము పాఠశాలలలో విద్యార్థులగతి యెట్లున్నదో చిత్తగింపుఁడు. వ్యాకరణమక్కఱలేదు. మాటలాడుకొనుచున్నట్లు వ్రాయవచ్చును. నాయనా! ఇదితప్పిదియొప్పని నొక్కిచెప్పి నవరించుట కుపాధ్యాయున కాధారములేదు, ధైర్యములేదు, అధికారములేదు. ఉత్తమబ్రాహ్మణజాతి వ్యావహారికభాష వ్రాసిమెప్పొందు కుతూహలముతో శూద్రబాలురు వర్ణయుక్కులును రేఫాశ్లేషములును యథేచ్ఛముగ వ్రాఁతలలో వినియోగపఱుచుచున్నారు. గ్రామ్య

వాదులకుఁ బరిహాసదూషణపాత్రులైన ప్రాంత తెలుగుపండితులు కడుపుచెక్కలుగ నవ్వుచున్నారు. "హిందుస్తానీ యింగ్లిషు" పదములు మనసువచ్చినట్లు నిరాఘాటముగ అచ్చువేసివిడిచిన యాంబోతులవలెఁ బ్రవేశించుచున్నవి. పిల్లలవ్యాసములు పెద్ద తెలుఁగువ్యాసములందుమా, పెద్దయింగ్లిషువ్యాసములందుమా యనుసందేహములు పుట్టుచున్నవి. నేనిచ్చట వ్రాయజంకుచున్న యనేకసులభాశ్లీలపదములచే విరాజిల్లు తెలుఁగు 'పేపర్లు' పరీక్షకుల కరపద్మముల నలంకరించుచున్నవి. నవీనాంధ్రప్రభావ మింతటితోనైన నాఁగునట్లు కనఁబడదు. కుచకచాద్యవయవవర్ణనములకు వడఁకి పోలు మృదులహృదయులకీ బాలశిష్యులు ముదిరి కవులయి వ్రాయుగ్రంథరత్నము లెట్లురుచించునో దురవగాహముగ నున్నది.

భాషకీగతి యేలపట్టెనో యెఱుఁగుదురా? "మోడరన్టెలు" గన్న నేమో విస్పష్టపఱుపకుండ దానినుపయోగింపుఁడని సెలవిచ్చుటచేత—వ్యాకరణనియమములఁ బాటింపనక్కఱలేదని శాసించుటచేత—పండితులమీఁది కోపముచేత నెవరికిష్టమువచ్చినట్లువారు వ్రాయవచ్చునని యజ్ఞానావస్థలోనుండి ముక్కుఁబచ్చలాఱని బాలురకు స్వేచ్ఛఁ బ్రసాదించుటచేత.

మనభాషవలెనేయుండు "అఱవము" నకు ఈగతియేలపట్టలేదు? ఉచ్చారణమునుబట్టి "bot" అనివ్రాసిన శిశువును తొడపాసెము పెట్టి "bought" అని పట్టుపట్టివ్రాయించు నాగరకభాషాశిఖామణియగు నాంగ్లేయభాష యీస్థితి కేలరాలేదు? ఈనిర్హేతుకజాయమానకటూత్కామృతరసము ఒకమనతెనుఁగుపై నేలప్రసరింపవలయునో తెలియకున్నది.

పోనిండు! దయార్ద్రహృదయులై పిల్లలను బాగుచేసి భాషాభి

ఆయవసరము తెలుఁగునకుమాత్రి మేలవచ్చినది ?

మాటలాడుకొను భాష నేర్చుకొనుటకుఁ బాఠశాలలేల ? యు పాధ్యాయులేల ? విషయభాగమున కధ్యాపకాపేక్షగాని భాషాభాగము స్వతంత్రముగ నేర్చుకొన శక్యమైనదేకదా !

నవీనాంధ్రవాదులు గోడమీఁదిపిల్లులవలె సులభముగవ్రాయుఁడు, మాట్లాడుకొనునట్లు వ్రాయుఁడు అని సెలవిచ్చుటయేకాని పఠన పాఠన సుకరముగ వారివాంఛలను ఇదమిత్థ మని విస్పష్టపఱుపరు. చెప్పలేరుగనుకఁ జెప్పరు కాఁబోలు. నియమశూన్యమైన భాషకఱపుట యెట్లు నేర్చుటయెట్లు ?

ఇదివఱకు గ్రంథములు లేక కేవల సంభాషణార్హమైన కోయ సవర చచ్చుట భాషలకుఁ గొ్రత్తనియమము లావశ్యకములుగాని సుమారు వేయిసంవత్సరములపూర్వమే యట్టిసంస్కారమునుబొంది యనేక పద్యగద్యగ్రంథములుగల మన తెలుఁగునకుఁ బునస్సంస్కరణమేల.

క్లిష్టత్వము అశ్లీలార్థసూచనము మొదలగుదోషములఁ బోఁగొట్టుటకు విసంధులు వాడుచున్నారదిచాలదా ? దుస్సంధులుగూడ గావలయునా ! వారిలో యందఱనుమనెదరా ? సులభోచ్చారణమునకు సంధులావశ్యకములే ! అదియెఱిఁగే పూర్వులు వ్యాకరణసూత్రరూపమునఁ గొన్నిసంధినియమము లేర్పఱచినారే ! సంధికూడదు కూడదని ఘోషించువారు వ్యావహారికభాషలోబోలెఁడుసంధులును అపసంధులు నున్నవని యెఱుఁగరా ? వాళ్లొస్తారు—వణ్ణందినేశేశేద్దాం—సులభప్పొస్తకాలు మాగ్గావాలి—ఏంభాగ్యఁవమ్మా—రోలొచ్చి మద్దెల్తో మొర్రెట్టుకున్నట్టు—యెరక్కపోయొచ్చాను బాబూ—ఇవన్నియు విపరీతసంధులుగావా ? నోటికివచ్చినట్టు ప్రజలు గ్రాంథికభాషలోఁగూడఁ బదములను బ్రత్యయములను నలిపి, ఒత్తి, సాగఁదీసి, గుండచేసి, తు

ప్పున నెఱకఁగొట్టి, రూపుమాపి, పాడుచేయకుండ నుండవలయు నని పెద్దలు కొన్నినియమము లేర్పఱచినారు. ఇది ప్రతిభాషకునుండు మ ర్యాదయే!

జ్ఞానాభివృద్ధియైనకొలఁది, మనభావములఁ బ్రకటించుటకుఁ జాలి నంతశబ్దజాల ముండవలయునుగాన భాషాభివృద్ధియుఁ గావలెను. అం దుకై యిదివఱకు వాడుకలోనున్న గ్రాంథికశబ్దములు చాలనియెడల, సులభసంస్కృతశబ్దములు దొరకనియెడల, మీయిష్టమువచ్చినన్ని య న్యదేశ్యపదములు తీసికొనవచ్చునే! దానికేమియు నభ్యంతరము చెప్ప లేదే! పూర్వలాక్షణికులు మీరడుగకముందే యనుజ్ఞయిచ్చినారే పా పము! అట్టివానికి వ్యాకరణానుసారముగఁ బ్రత్యయములు గలిపి, అనఁ గా తెనుఁగువేషమువేసి తెనుఁగుగ్రంథములలోఁ బ్రవేశపెట్టుమన్నారు. ఇంతకంటె మీకేమికావలయును? "థర్మామిటర్లు" అనకుండ "థ ర్మామిటర్సు" అనుమనెద రా? 'వచ్చును' కంటె 'వొస్తాదు' సుల భమా?

దేశకాలస్థితులననుసరించి యవశ్యముగఁ గావలసినమార్పులు మాత్రమే గ్రాంథికాంధ్రమునందుఁ గలుగుచుండుటచేత నించుమించు గ నన్నయకాలపువారికి నీకాలపువారికి నొక్కవ్యాకరణమే ప్రమాణ మైయున్నది. కట్టుపాటులు దరిదాపుగ నొక్కరీతినేయున్నవి. ఇది భాషాసౌకర్యలక్షణముగాని దౌష్కర్యసూచకముగాదు. మనయిప్పటి భాషాసంస్కర్తలయుద్యమములు సఫలములైనఁ జెప్పలేనుగాని, సం ప్రదాయానుసారముగ భాషనిలిచినయెడల, నెంతపెరుఁగుచున్నను, ఒ క్కవ్యాకరణము చదివినయెడల, నెప్పటివారికైన, బహుళాంధ్రగ్రంథ జాలము తెలియఁగలదు. మనవారభిలషించుచునట్లు ప్రతిశతాబ్దమునకు ను అర్ధశతాబ్దమునకును భాష మాఱుచుండినయెడల, గ్రంథగ్రహణము

న. కేకవ్యాకరణవేత్తృతచాలదు. ఇంగ్లిషుభాషలో— Anglo-Saxon Grammar—Pre-Chaucerian English Grammar-Chaucerian English Grammar—Shakespearian Grammar—Modern English Grammar (ఇప్పటివఱకు) ఉన్నట్లే, కొంతకాలమునకుఁ దెనుఁగునఁగూడ ననేకవ్యాకరణము లుండవలసివచ్చును. ఆమూలాగ్రము గ నాంధ్రవాఙ్మయము చదువఁగోరు భావిపాఠకుఁడ నేకవ్యాకరణపఠనావశ్యకతచే నెట్టియిక్కట్టులపాలగునో యించుక యోజింపుఁడు. వాంఛార్హమైనది పనికిమాలిన బహుత్వముగాదు, ఉపయోగకరమైనయేకకత్వము. కావున యుక్తాయుక్తముల నాలోచింపక ఆంగ్లేయభాషాసంప్రదాయములన్నియు మనతెలుఁగులోనికి రావలయునని తీసికొనివచ్చుటకు యత్నింపకుఁడు. లోపములులేని మాణిక్యమువంటిభాషలో నెన్నరానిలోపము లున్నవని భావించుకొని లేనిరోగమునకుఁ జికిత్స ప్రారంభింపకుఁడు. అట్టి బహుళవ్యాకరణాభిలాషులు, ఒకయమ్మఁగోసిన నలుగురమ్మలగుదురని చంకలుగొట్టుకొను అజ్ఞబాలకులవంటివారు!

మఱియొకమనవి నాలింపుఁడు. పూర్వుల కట్టుదిట్టములును దెలివితేటలును గొంచెము పరిశీలించిచూడుఁడు. దేశాంతర్భాగములఁబట్టి వృత్తులఁబట్టి, వ్యవహారభేదములఁబట్టి, మాటాడుభాష—అర్జీలు, శాసనములు మొదలగువానిలోనిభాష—మాఱెడిది, మాఱుచున్నది. వ్యాకరణనియమములు వ్యావహారికభాషకుఁ బెట్టినఁబనులు సాగవు. ఆజ్ఞలుసాగవు గనుక నట్టిదుర్ఘటములైన కట్టుపాటులందులో నేర్పఱుపలేదు. ఈభాషలో నొకజిల్లావారిమాట లింకొకజిల్లావారికిఁ దెలియనంతభేదమున్నది. ఉచ్చారణములో హ్రస్వదీర్ఘప్లుతభేదములు, పదప్రత్యయభేదములు, "యాసలు" ఇట్టివనేకములుగలవు. "సర్వంక్షణికం క్షణికం" అన్నట్లెన్నిమార్పు లీవ్యావహారికభాషలోఁ గలుగుచు

వ్వను ఎన్నిభేదములున్నను సర్వాంధ్రదేశప్రజకును గ్రాంథికభాష మాత్ర మొక్కటియే. వ్యాకరణమునొక్కటియే. ఇది పరంపరగా వచ్చుచున్నది. గ్రామ్యవాదులపంతము నెగ్గినదక్క ఎన్నఁటికినిట్లేయుండఁ గలదు.

సంబంధబలముచేఁగలిగిన యలవాటుచేతఁగాని,తమయభిప్రాయములు సులభముగఁ దెలియవలయునని కాని, పల్లెలలోనుండు బ్రాహ్మణోత్తములు విద్యావంతులు క్రిందిజాతిపాలికాఁపు "నౌకర్ల" తో మాటాడునప్పుడు "పచ్చిగ్రామ్యము" నుపయోగించినను, కలముపట్టుకొని గ్రంథము వ్రాయఁబూనినపుడు వ్యాకరణయుక్తముగనే వ్రాయుదురు. తమపిల్లలకేభాష బోధింపవలయునన్న "గ్రాంథికభాష" యే యందురు.

వ్యావహారికభాషలో నింతభేదములేదు——మీరతిశయోక్తులాడుచున్నారనువారి కీక్రిందవ్రాసినపట్టికయే జవాబిచ్చును.

అనంతపురపుజిల్లాలో నుద్యోగిగనున్న యొకగోదావరిజిల్లాబ్రాహ్మణుఁడు, బి. ఏ.,——తానును దనభార్యయును గోదావరిజిల్లా వ్యావహారికభాషతో నింటియొద్ద మాటాడుకొనుచుండ, నాజిల్లాతెలుఁగువాండ్రైన వడ్లుదంపుమనుష్యులు దగ్గఱనుండుటచేత విని యొక్కమాటయుఁ దెలియకపోవుటచే "మీరఱవలా?" యని యడిగినారఁట.దీనిఁబట్టి వ్యావహారికభాష సర్వజనగ్రాహ్యమో పుస్తకభాష సర్వజనగ్రాహ్యమో నిష్పక్షపాతబుద్ధితో విమర్శింతురుగాక.

వేయేల! హాస్యగ్రంథములు గ్రామ్యభాషలో వ్రాయుదురు గదా! మనజిల్లాభాషలో వ్రాసిన హాస్యగ్రంథము అనంతపురపు మన ఆంధ్రసోదరుని చేతిలోఁబెట్టుఁడు. మూసిననోరు మూసినట్లేయుండును. ఒక్కనవ్వులేదు, "గొడవ" గానుండుటచేతఁగాఁబోలు కావలసినన్ని

వెఱ్ఱిచూపులు. గ్రామ్యభాషావిరచిత హాస్యగ్రంథమునకు మాఱేదో యొక గ్రాంథికభాషలో వ్రాసిన పుస్తకము చేతఁబెట్టుఁడు. చదివి మన మెట్లానందాది రసలక్షణములు ముఖమునందుఁ గనఁబఱుతువో యాతఁడు నట్లే చేయును. ఇది యనుభవసిద్ధముగాని మఱొండుకాదు. సోదరులారా! పుస్తకములు వ్యావహారికభాషలో వ్రాయుమనెదరో చిరకాలమునుండి యుపయోగింపఁబడుచున్న, వ్యాకరణయుక్తమైన, సర్వాంధ్రజననుగ్రహమైన, భాషలో వ్రాయుమనెదరో చెప్పుఁడు.



# పట్టిక:

| సంఖ్య | అనంతపురంజిల్లాలోని యుత్తమ జాతివారు వ్యావహారికభాషలో వాడుకొనుమాటలు. | గోదావరిజిల్లా యుత్తమజాతివారు వాడు వ్యావహారికభాషలోవాని యర్థములు. |
|---|---|---|
| 1 | అట్టువ | చిట్టటుక |
| 2 | వాడ | గాది |
| 3 | వాకిలి | తలుపు |
| 4 | వాకిలిచిలుకుపెట్టు | తలుపుగొళ్లెంవేయి |
| 5 | తిక్కాట | తోంవుట-నొక్కి-రాయడం |
| 6 | దొబ్బుట | తోయడం |
| 7 | పైవేళ. పైటివేళ | మధ్యాహ్నం రెండుఝాములు దాటాక |
| 8 | మెట్లుదెబ్బలు | చెప్పుదెబ్బలు |
| 9 | పాపాసికల్లి | బ్రహ్మదేవుడ్డొంక |
| 10 | మడుగు | మడి (మడిగట్టుకోవడం) |
| 11 | షష్టిపంచి | అంగాస్త్రము |
| 12 | కుట్టి | గిత్త |
| 13 | కసువు | తుక్కు-పెంట |
| 14 | నూకుట | తుడవడం-వూడవడం |
| 15 | పొరక | చీపురు |
| 16 | పొరకతోనూకుతా | చీపురుతోవూడుస్తా |
| 17 | కాపులు | మురుగులు |
| 18 | ఒప్పులు | ముక్కలు |
| 19 | బొట్టు | డబ్బు-కాని |
| 20 | చాదుచుక్క | శిలాయిబొట్టు |
| 21 | గడారు | గునపం-గడ్డపార |

| | | |
|---|---|---|
| 22 | జోడుతపెల | గంగాళం |
| 32 | మెత్తగా | సుస్తీగా-జబ్బుగా |
| 42 | వాడు మెత్తగావున్నాడు | వాడు సుస్తీగావున్నాడు |
| 25 | జాగ్రతగా (బల్లారిజిల్లాపదము) | చురుగ్గా, వొడిగ్గా, ఛప్పున |
| 26 | తలపిసకపట్టుట | తలమెతకపట్టడం |
| 27 | ఇగ్గుట | లాగడం |
| 28 | చల్లడము | తొళ్లాగు |
| 29 | కంభావతి | పట్టుపంచ |
| 30 | తట్ట | పళ్లెం |
| 31 | బేస్తవారము | లక్షింవారము |
| 32 | లక్ష్మివారము | శుక్కురువారము |
| 33 | ఉద్దులు | మినువులు |
| 34 | బేడలు | పప్పు (వొండంది) |
| 35 | పప్పు | వొండినపప్పు (మాత్రమే) |
| 36 | గోడంచి | జీడిమావిడిపప్పు |
| 37 | చెక్కలు | పుడకలు (పోగచెక్కలుకావు) |
| 38 | సున్నంపూపించడం | వెల్లేయించడం |
| 39 | కొల్లబోనీ | పాడైపోనీ |
| 40 | కొల్లకున్నాయి | చాలావున్నాయి |
| 41 | రుబ్బుకుగుండు | రుబ్బుపొత్రం |
| 42 | వరలవద్దు | వేలొద్దు |
| 43 | గలాట—గద్దలం | అల్లరి—గోల |
| 44 | మర్నాడు | ఎల్లుండి |
| 45 | తట్టుకో | వుండు |
| 46 | పాడిందిపాడిందీ | పాడిందేపాడడం |
| 47 | ఏడసాల | సావిడి—హాలు |

| | | |
|---|---|---|
| 48 | లేవిడీలేవుట | లేవిడీకొట్టుట - వేళాకోళంచేయడం |
| 49 | కొంప | వూరు |
| 50 | బెల్లవువడక | బెల్లమ్ముక్క |
| 51 | నుగ్గులు | పిడకలు |
| 52 | నిలబడుకోవడం | నిలబడడం |
| 53 | శాకము | వేడి |
| 54 | మూగిదెబ్బలు | కొకుదెబ్బలు |
| 55 | చింతపిచ్చలు | చింతగింజలు |
| 56 | బోకిపెంకు | చిల్లపెంకు |
| 57 | రేణిబల్లు | రేగుపల్లు |
| 58 | మొలకకూర | పెరుగుతోటకూర |
| 59 | తీటగంజరి | దూలగుండ |
| 60 | బిడ్డ | కూతురు (కొడుకుకాదు) |
| 61 | లెయ్‌రా | లేవరా |
| 62 | యాలకబుడ్డలు | యాలక్కాయలు |
| 63 | హారట్లుకొట్టడం | బాతాఖానీవెయ్యడం |
| 64 | (చారు) వెయ్యి | (చారు) పొయ్యి-వొడ్డించు |
| 65 | బాణలి | బూర్లెమూకుడు |
| 66 | కట్ట | అరుగు |
| 67 | మబ్బులో ఊరికిపోతా | రాత్తిరి వూరికి వెడతాను |
| 68 | వూసాటిగావచ్చింది | వుచితంగా-డబ్బివ్వకుండా-వొచ్చింది |
| 69 | ఇప్పించుకొనిరా | పట్టుకురా-తీసుకురా |
| 70 | మెత్తగానడు | మెల్లిగానడు |
| 71 | యాడకు వెళ్లుట | యక్కడికి బయల్దేరడం |
| 72 | పెట్టెడు | పెట్టు |

| | | |
|---|---|---|
| 73 | పోదువుకూర్చో | పెడుదుగాని కూచో |
| 74 | నీవాడకు పోవలసుండె | నీవక్కడికి వెళ్లుండవలశింది |
| 75 | సుబ్బరాయణ్ణి మర్నాడుపొద్దు గలగాపట్టుకొనిరా | సుబ్బారాయుణ్ని మెల్లుండి పెందలాడే తీసుకురా |
| 76 | వానితంటాకు బోరాదు | వాడిజోలికి పోగూడదు |
| 77 | నీతో మెట్లుయేగేది | నీతో మెలా వేగడం |
| 78 | కండ్లుకుట్టినవి | కళ్లుకలిగాయి |
| 79 | బోకులు | గిన్నెలు |
| 80 | బొరుగులు | మొరమొరాలు |
| 81 | కొండబో | తీసుకువెళ్ళు |
| 82 | మొగలిచెండు | మొగలిపువ్వు |
| 83 | చిత్తం దేవరా | చిత్తంవయ్యా— చిత్తంబాబు |
| 84 | గెణుసుగడ్డ | చిలగడిదుంప |
| 85 | నిన్నుకూస్తాడు | నిన్నుపిలుస్తాడు |
| 86 | చెండుపువ్వు | బంతిపువ్వు |
| 87 | క్వా | యిదుగో-పట్టు (యేదైనపెట్టేటప్పుడు) |
| 88 | (బండి) సవారి | (బండి) గూడు |
| 89 | లాందరి | లాంతరు |
| 90 | వస్తానప్పా | వెడతావయ్యా |
| 91 | సుమారుగాఉన్నది | కొంచెన్నింపాదిగావుంది |

# అనుబంధము 2.

## హైదరాబాదు రాష్ట్ర వ్యావహారికాంధ్రపదపట్టిక.

పదములు. గోదావరిజిల్లా వ్యావహారికభాషలో వాని యర్థములు.

1. వతను = రాబడి.
2. సాలె = బరి.
3. కూకుంటావ్ = కూచుంటావు.
4. సాలె = భావమరిది.
5. గోరం = చిత్రం.
6. బూరు = ఎక్కువబొచ్చు.
7. ఆన = వాన.
8. నాత్రి = రాత్రి.
9. వొయ్యి = పొస్తకం.
10. వగ్నెంపుట = గర్భాదానం.
11. తోలుకొచ్చుట = తీసుకొచ్చుట
12. లొల్లి = అల్లరి.
13. ఎల్లుట = వెళ్లుట.
14. ఇయాల = ఈరోజు.
15. గిట్రా = ఇలా రా.
16. గిట్ల = ఇలా.
17. జెకిండు = కొట్టాడు.
18. ముల్కి = దేశం.
19. నీభాంచోణ్ణి = నీనౌఖర్ని.
20. నీకాల్మొక్త = నీపాదాలుపడ
21. తోడెము = కొద్దిగ. [తాను.
22. ఇన్నిరి = విన్నారు.
23. ఇగో = ఇదుగో.
24. అన్నాలం = అన్యాయం.
25. కర్రెగనున్నడు = చిక్కాడు.
26. గట్ల = అలా.
27. బావనయ్య / బామనయ్య / బాఁవండు } బ్రాహ్మడు.
28. యాడికి = యెక్కడికి.
29. గాడికి = అక్కడికి.
30. సీకటి = చీకటి.
31. పోస్తది = పోస్తుంది.
32. సనుగు = ప్రతి.
33. అగ్గువ = చవక.
34. వుక్కటికి / -ఊకె } = ఊరికే.
35. దాంట్ల = అందులో.
36. గొల్లపొల్ల = గొల్లాళ్లపిల్ల.
37. సైసు = ఉండు.
38. పొద్దుమూకుట = పొద్దుకూకుట
39. యిస్తాళ్లు = విస్తరంటలు.
40. గుద్దపట్టిండు = గుద్దడ మొత్త
[పెట్టాడు.

41 దుకునం=దుకాణం.
42. చూయించు=చూపించు.
43. అప్పయ్య=పినతండ్రి.
44. చిన్ని=పినతల్లి.
45. తనఖా=జీతం.
46. దువ్వం=రెండోతరగతి.
47. సువ్వం=మూడోతరగతి.
48. టొంభైయాఱు=తొంభైయా
49. కూలబడు=కూచో. [రు.
50. దవాఖానా=ఆస్పత్రి.
51. బరుసుబరుసు=మోట.
52. ఎంటికలు=వెంట్రికలు.
53. తలంటారం=తలంటు.
54. ఆస్తె=నెమ్మదిగా.
55. ఆకు=పేజీ.
56. ఎన్కాల=వెనకభాగాన్ని.
57. కొంచబోతా
కొంటబోతా } =తీసుకుపో
58. కొట్టేశిండు=తీసుకున్నాడు
59. అండ్ల=అందులో.
60. మంచోడు=మంచివాడు.
61. అడిగిండు=అడిగాడు.
62. బగ్గోని=గిన్నె.
63. దేకిచ
కొప్పెర } =డేకిసా.
64. మీవోండ్లు=మీవాళ్లు. [యాక
65. తీస్కపోయినంక=తీసుకుపో

66. గుడ్డోడు=గుడ్డాడు.
67. తెల్లారినంక=తెల్లవారాక.
68. -ంకిపోయిండు=పారిపోయాడు.
69. అయిందిగని=అయిందికాని.
70. పిల్సిండ్రు=పిల్చారు.
71. రాంగనె=రాగానే.
72. బొయ్యారము=కన్నం.
73. ఏంజేసిందికద=ఏంజేసిందంటే.
74. పెయ్య=వొళ్లు.
75. ఈ=ఊఁ.
76. ఆడివాండ్లు=ఆడాళ్లు.
77. ఎల్లిండు=వెళ్లాడు.
78. ధప్పా=నెత్తిమీత్తన్న.
79. లాతు=తన్ను.
80. తోవ్ల=తోవలో.
81. అవాకోరి=గాలిపీల్చడం.
82. ఇగేంగదంటె=ఇంకేమిటంటే.
83. అర్రాజ్=వేలాం.
84. థా
తాన } =దగ్గర.
85. పురోతుడు=పురోహితుడు.
86. సఁ=సంవత్సరం.
87. రోఖాయించకు=అడ్డంరాకు.
88. ధౌతి=సిరాబుడ్డి.
89. కాయిదం=కాగితం.
90. అగో=అదుగో.
91. గైరిది=గొప్పది.

92. నాసిది=తక్కువది.
93. ఆనంగ=ఆవేపు.
94. ఈనంగ=ఈవేపు.
95. ఎందులకెల్లి=ఎక్కణ్ణుంచి.
96. నంగాగాడు=తక్కువ్వాడు.
97. మోఖళా=పెద్దసంతర్పణ.
98. దొడ్డు, దొబ్బ=లావు.
99. తుళ్ళి=గజ్జలపట్టెడ.
100. గవాయి=సాక్ష్యం.
101. పొద్దులు=పురిటిరోజులు.
102. సరువ=పాత్ర.
103. గేంటీలు=స్త్రీలు చెవలకుపె
[ట్టుకొనేనగ.
104. క్యాదకి=మొగల్ రేకు.
105. కిశ్తి=ఇనప్పళ్లెం.
106. కచ్చడం=బండి.
107. తేజుగావుంది=ఎక్కువగావుం
108. ఇసుర్రాయి=తిరగలి. [ది.
109. మిసిరి
-నగుబోతు } పటికిపంచదార.
110. పయ్య=బండిచక్రం.
111. చితలప్పండు=శీతాఫలప్పండు
112. యిలాచీలు
-ఇలాచీలు } =ఏలకులు.
113. అంబట్లతుట్ల=రెండుపక్కల
114. అందంక=అందాక. [వాళ్లూ.
115. అంళ=అందులో.

116. అత్తరబుత్తర=తొందరగా.
117. అమ్మాయి
పెద్దాయి } =పెత్తల్లి.
118. అన్నయ్య
-కాక } =తండ్రి
119. అన్నగాడు=పెద్దాడు.
120. అల్లాయిపుల్లాయి=కాగలించు
121. అప్పటికి=తర్వాత. [కోవడం.
122. అనుకోజిక్కి=అనుకొన్నేమో
123. అరుచుకో=కనుక్కో.
124. అయ్యార్లు
అయ్యోర్లు } =వైష్ణవులు.
125. అలుకుట=విత్తనాలుపోయడం
126. అశ్వ
అశ్ప
కలవ } =మంగలిపొది.
127. ఆనంగ=అట్నించి.
128. ఆతోవపొంటిఉరుకు=ఆతోవ
[నుపారిపో.
129. ఆరిశలుజోడు=సులోచనాల్జో
130. ఆమెల్లి=నిన్న. [డు.
131. ఆయిన్ని=అవన్ని.
132. ఆయింత=అదంత.
133. ఆలుగడ్డ=బంగాళాదుంప.
134. ఈనంగ=ఇట్నించి.
135. ఇడుగుపెట్టుట=మాగాణి భూ
మిని మొదటిసారిదున్నడం.

136 ఇక్కేర=హారతికర్పూరం.
137 ఇలపీట=కత్తిపీట.
138 ఉద్దెర=అరువు తేవడం.
139 ఏమిలె=ఒప్పుకొనడం.
140 ఎక్సాను=లాభం.
141 ఎక్కా=గోడలాంపు.
142 ఒండింపుట / వొండింపుట / వొడినింపుట } =గర్భాదానం చేయడం.
143 కంగు=పాలమీదమీగడ.
144 కంకపెనాలు=వెదుళ్ల బీడు.
145 కంచుడు=మూకుడు.
146 కండ్లొచ్చినై=కళ్లుకలగడం.
147 కంకగుల్ల / పాలగుల్ల } =వెదురు పేళ్ల బుట్ట
148 కంచె=బీడు.
149 కడిఅయినరు=వెళ్లిపోయారు.
150 కమ్మలయిల్లు=తాటాకిల్లు.
151 కణతలుతీయుట=ఊరేగించుట
152 కళ్లేపుగిన్నె=గోకర్ణం.
153 కట్లవిత్తులు=కుంకుడుకాయల్లా [టిగింజలు.
154 కరడాలుదిద్దుట=కాపీవారవడి [పెట్టడం.
155 కసపపీట=బండిలో బండివాడు [కూచునేచోటు.
156 కళాబందిమేళము=బోగమ్మేళ [ము
157 కిస్సాబడ్డది=తగాయిదావొ [చ్చింది
158 కుట్లకెల్లతినుట=గొంతుకదాకా [తినడం.
159 కొరకాసు=కొరకంచు.
160 గర్జులేదు=అవసరన్లేదు.
161 గడుగా=పంచిపాత్ర.
162 గడ్డినూనె=కిర్సనాయల్ నూనె.
163 గత్తర=కలరా.
164 గట్టిపిండి=నలుగుపిండి.
165 గది=అది.
166 గప్పుడు=అప్పుడు.
167 గాజులు=నూతివారలు
168 గాడెము=ఏతాం.
169 గామాట=ఆమాట.
170 గిజగిజఉరుకుట / గిద్దగిద్దఉరుకుట } =గబగబపరుగెత్తడం.
171 గిత్తలు=బండిచక్రం.
172 గిరివి=తాకట్టు.
173 గుద్దబట్టలు=కట్టుబట్టలు.
174 గుడాలు=గుగ్గిళ్లు.
175 గై=వెదురుగడ.
176 గైరి=మంచిది.
177 గొట్టు=గట్టిది.
178 గోదలు=ఎడ్లు.

179 చిక్కుడుకాయలు పెట్టుట=కితకి [తలెట్టుట.

180 చిమ్మెదునస్యము=ఒక్కపట్టు [పొడుం

181 చిక్కనం=ముగ్గుపిండి.

182 చేపోయి=బదుత్తేవడం.

183 చేరేళ్లు=ద్వారబంధాలు.

184 చైసు=నిదానించడం.

185 చాల్ శెయ్యి=చాలించు.

186 చక్కిలం, ముక్కిలం=మురకం [వేయువిధం.

187 చుక్క=పావలా.

188 జీవిలిపుల్ల=గులివితెడ్డు.

189 జూకుట=తూచడం.

190 జఱ్ఱిట్లబోయింది=రవంతలో [తప్పిపోయింది.

191 జింగిపోయింది=ఆగిపోయింది.

192 తొంగులుబొడుచుట=మొట్టడం

193 తంతెలు=మేడమెట్లు.

194 తాయపెంకు=ఇనపసిబ్బి.

195 తింపు=తిప్పు.

196 తీటకోయిల=దూలగుండ.

197 లంటుకులంటు ఉన్నడు- తుంటకుతుంట ఉన్నడు =చాలా లావుగా వున్నాడు. [యాడు.

198 తుట్టపోయినాడు=దండుగపో

199 తుఱ్ఱబడాయించింది=పొగరె [క్కింది.

200 తొడచిమ్ముట=తొడపాశం [పెట్టడం.

201 తొడుకోపోవుట=పిలుచుకు [పోవడం.

202 దండెడ=పెద్దమాను.

203 దప్పాలు=దెబ్బలు.

204 దస్తీగుడ్డ=చేతిరుమాలు.

205 తెంకులాడుట / దేవులాడుట / నెంకులాడుట =వెతకడం.

206 దేశాటిపని=స్వదేశప్పని.

207 దొంతికూర్చున్నడు=గొంతు [కూర్చున్నాడు.

208 పంగాగాడు=చాలాబీదవాడు.

209 పక్క=దొంగవాడేశేకన్నం.

210 పితుకు=ముక్క.

211 నాలుగక్కళ్లనించి=నాలుగువే [పుల్నుంచి.

212 నిప్పు=సహం.

213 పందార=చక్కెపంచదార.

214 పండ్లపొడి=దాళిన్చెక్క

215 పత్తులు=ఫాళీలు.

216 పన్నావా=పడుకొన్నావా.

217 పడిపోయినది=దిగబడింది.

218 పడకొట్టిరా=పంపించిరా.

219 పాలబిందె=నల్లికిళ్ల పాము.
220 పిట్లా=ఉప్పుడుపిండి.
221 పిన్నాడు=పిల్లాడు.
222 పిస్సవాడు=పిచ్చివాడు.
223 పుంటికూర=గోంగూర.
224 పుల్లగండోడు=పోకిరి. [లా.
225 బంగుబాయి=తూగుటుయ్యా
226 బడెఉన్నవు=మహావున్నావు.
227 బరిబాతల=దిగంబరిగా
228 బేడెము=తలుపుగడియ.
229 బేగిరా=చప్పున్రా.
230 బేపులు=తేనువులు.
231 బొంగబోవుట=చెరువుగట్టుకొ
[బెజ్జంపడినీరుకారడం.
232 బొక్కలు=ఎముకలు.
233 మందిబీదుగాఉన్నరు=జనసమ్మ
[ర్దం ఎక్కువగావున్ది.
234 మన్నెపువాడు=మాలాడు.
235 మాణిక్యాలు=దీపప్రమిదలు.
236 మిత్తి=వడ్డీ.
237 మూలగొట్టుమాట=మార్యా
[లపదం.
238 మొక్కపోట్లు=మొక్కజొ
[న్నపొత్తులు.
239 యసల=పిడత.
240 యాష్టవచ్చింది=వినుగేశింది.
241 యాది=జ్ఞాపకం.
242 లండోడు=పనికిమాలినవాడు.
243 ఉలాసిగాకొట్టరా=ఈడ్చికొట్ట
[రా.
244 వట్టలుబడగొట్టుట=దద్దుర్లు
[పడేటట్టుకొట్టడం.
245 వయి=పొస్తకం.
246 వల్లు=శఘుసంగాలేదు.
247 వృశుక } యిసక.
వృస్క
248 వొంటెంచుట=కుదర్చడం.
249 వాడిసిపోయినవి=అయిపోయి
[నవి.
250 వార్లుట=గట్టిగాఅరవడం.
251 వోదించుకోనిరా=భోజనాని
[కొస్తాననిపించుకురా.
252 శాస=పారాయిణి.
253 శేకోత్రిపుకాయ=పంవన
[వనానకాయ.
254 సాలెం=అన్నీ.
255 సాతచేయించుట=గుడ్డలు
[చలవచేయించడం.
256 సానుపుచల్లుట=కళ్లాపుచల్ల
257 సర్ది=రొంప. [డం.
258 సుర్మాకలం=పెనసలు.
259 సైదం=మెత్తనిగోధుంపిండి.
260 పేండ=పేడ.
261 పెద్దమనిషి=ముసలాడు.

262 పొంటేలు=రషాములు.
263 పొడావు=పొడుగు.
264 పొడగొట్టు=పోగొట్టడం.
265 పొప్పడికాయ=బొప్పాయి [కాయ.
266 పోచమ్మ=మశూచికం.
267 పల్లీలు=వేరుశనగపప్పు.
268 బొసండ్లు=వంటగిన్నెలు.
269 గోలుగా=గుండ్రంగా.
270 ఉనక=ఊక.
271 ఎందుల్లో=ఏమిరోయి.
272 కైకిలి=కూలి.
273 కీసాలు=చొక్కాజేబులు.
274 వాయి=ఓయి.

## గుత్తి తెలుగు.

యెట్టమసి=యెట్టుసిరా. పేనా=కలం. చుట్టం=వుంచుకున్నది. అన్నప్పాడి=కందిపొడుం.

## గంజాము తెలుగు.

కెట్టకాయలు=కుంకుడుకాయలు.

# అనుబంధము 3.

## ఉత్తరములు.

మరాసిలా అజ్జీక ఖెహారీ తహసీల్ తాలూకా శిరిశాలజిలె మెల్ గందర్ వాక్యా బ 3 పర్వర్ది న్హ ౧౩౦౬ సాలు నిహాణ ౩౨౮.

ఖీ. నరసింహారావు ఫుమీదార్ తహసీల్ హాజాకు తెలియపర్చనవుతుందికదా అలీజనాబ్ అవ్వల్ తాలూకాదార్ సాహేబ్ జిలె ఎల్గందల్ గారు బిల్ ముషాఫాయలాటిహుకుం యిచ్చిఉన్నారుకదా.

సీకు మోజె నల్లగొండవకొరెపట్వారిగిరిపైన మామూలచ్చేయగలందు లకు—

కావున హుకుం యివ్వనవుతాందికదా నీవు మువాజిక్ మ జ్కూర్కు నేడే హాజరయ్యి దప్తర్పట్వార్గిరిజాయి జాహీల్ జేసు కొని ప్రతిదివసం మహాజాత్మజ్కూర్లో హాజరుండి సర్కార్పని బహుజాగ్రత్తగా అదా చేస్తూవుండావలసింది. లాకె ఇంరెదుల్ఖులా ఎజాయిదాద్సర్కార్ ఖిద్మతుపైన ముస్తఖిలానా మామూరు చేయ గలందులకు వేహాజ్చేయడం కాగలదు.

(౧) ఇందువలన మునన్నసాబక్ పట్వారికిచ్చి వ్రాయించేది యేమనగా నవుదప్తర్పట్వార్గిరిజాయిజా నరసింహారావుకిచ్చి నీవు అలగ్ కావలసింది.

(౨) మునన్నసానిదప్తర్నగదీకి బగర్జెయిూసాబోయిస్కీ యి వ్వడమైంది. ఫక్తు.

అర్థము. (గ్రాంథికభాషలో)

ఎల్గందల్జిల్లా శిరిశాలతాలూకా తహసీల్కచ్చేరీనుండి

తేది 2 వ పర్వర్ది 1306 సం॥

నెం 374

ఉద్యోగార్థి యగుప్రవిషనర్ నరసింహారావునకు తెలియప రుచునదేమనఁగా

నిన్ను నల్లకొండ, కోరెమనుగ్రామములపైని కరణముగానియ మించినామని

కావున నిప్పు డాజ్ఞయిచ్చునదేమనఁగా నీవాగ్రామాదులకు నేఁ డేవెళ్లి కరణపులెక్కలకాగితములను స్వాధీనముచేసికొని ప్రతిదినమును ఆగ్రామాదులలో నెల్లప్పుడు నివసించుచు దొరతనమువారిపనిని జాగ్ర

శ్త్రతో నెఱవేర్చుచుండవలసినది. దీనికి ప్రతిఫల మేమనఁగా దొరతన మువారి యుద్యోగస్థానములలో నేదయినను కాళీయుండినయెడల నప్పటి మాచిత్తమునసనుసరించి దానికి నిన్ను నుద్యోగిగాఁ జేయఁగలము. ఇందులకుప్రతి. ఇదివఱ కుండినకరణమునకు వ్రాయించి యిచ్చినదే మనఁగా-నీవు కరణపులెక్కలకాగితములను నరసింహరావున కిచ్చి నీవు తొలఁగవలసినది.

ఇంకొకప్రతి—కోశాధ్యక్షునికి వేతనమిప్పించుటకై యాజ్ఞ యీయఁబడినది.

ముగిసినది.

---

బెంగుళూరు 8-5-14.

చి. సుబ్బయ్యకి తాళంక్కి చిన్నశరసింహ్మశెట్టి చేశేఆశీర్వాదం.

మీకి ౨-3 కార్డులు వ్రాయించిన జవాబులేదు. యేమికారణం తెలియలేదు. నేను నింన్ను కణ్యకవుంచి చూచేకి రమ్మని రాస్తిని. యిదివర్కు రానిదాన్కు రాశేది. వారు యింకా వ్యారేచూడవలెనని వుంన్నారు. దాను వల్లారాయించినాను. మాపుట్టయ్యయింట్కి పోటువంటమనిషివచ్చెనా అడగికొనివచ్చేది. బాకిలిబారం మీజాబు చూచి రాస్తాను. యిచ్చట అవ్వయ్య క్షేమముగా వుంన్నది. అయితే తూదేవనికి పూజచేసివుంటొన్కె అవ్వయ్య దొరకను. ఆయంమ్మ తప్పా రామ నాతప్పుగా వుంన్నది.

## అర్థము. (గ్రాంథికభాషలో)

8—5—14.

చి॥ సుబ్బయ్యకు తాళంకి చిన్నరసింహముసెట్టి చేయురాశీర్వాదము.

మీకు ౨-3 కార్డులు వ్రాయించినను ప్రత్యుత్తరమీయలేదు. ఏమికారణమో తెలియదు. నేను గన్యకను జూచియుంచి నిన్నుఁ జూచుటకు రమ్మని వ్రాసితిని. ఇంతవఱకు రాకపోవుటకుఁ గారణమేమో వ్రాయునది. వారు మఱొకసంబంధమును జూడవలయుననియున్నారు. కాన వ్రాయించినాను. మాపుట్టయ్యయింటికి వంటవాఁడువచ్చెనా? తెలిసికొనిరావలయును. తక్కినసంగతులు మీయుత్తరముచూచి వ్రాసెదను. ఇచ్చట అవ్వగారు క్షేమముగా నున్నారు. ఇట్టియవ్వగారు లభించుటకు నే నేదేవుని బూజించియుంటినో? రామ రామ! ఆమెతప్పేమియు లేదు. అంతయు నాతప్పే.



# బడులలోఁ బెట్టు తెలుఁగుపుస్తకములు.

ఇంగ్లిషుభాషలో బాలురు చేదువుకొనుట కనుకూలములయిన పుస్తకము లనేకములున్నవి. ప్రస్తుతకాలమున నట్టి చక్కనిగ్రంథములు సంఖ్యలోను, సరసతలోను, దినదినాభివృద్ధిఁ గాంచుచున్నవి. మన తెలుఁగుభాషలో లేఁతవయసువారి కుపయోగించుపుస్తకము లిప్పుడే వెలువడుచున్నవి. అవిగూడ నుండవలసినట్లున్నవని చెప్పుటకు సాహసింపలేము. విషయసంబంధమయిన లోపములో, భాషాసంబంధమయిన లోపములో, పెక్కుపుస్తకములలోఁ గనఁబడుచున్నవి. అట్లుండుటకు నాకు గోచరించినకారణములు కొన్ని మనవిచేసికొనెదను.

పూర్వమువ్రాసిన సలక్షణవచనకావ్యములు మిక్కిలి తక్కువ. అదిగాక, వానిలోఁ బద్యకావ్యస్థములగు కఠినపదములు, సమాసములు, చాలఁగనున్నవి. అవ్వి పాఠశాలలలోఁ బఠనగ్రంథములుగఁ దఱచుపయోగింపఁబడుచుండుటచే బాలురకుఁ గొంచెము కష్టముగనుండెడిదనెడుమాట యనృతముగాదు. విషయగ్రహణముకంటె భాషాగ్రహణమే కష్టతరముగ నుండెడిది. ఇది కనుఁగొని భాషాభిమానులగు మన మిత్రులు గొందఱు లోపములు సవరింపఁబూనుకొనిరి. ఉద్యమము మంచిది. ఉద్దేశము శ్లాఘ్యము. కాని యవలంబించినమార్గములు మాత్రము విద్వజ్జనసమ్మతములుగా లేవు. నియమములు పాటింపక, యెక్కడనో యొకచోట వ్యవహారములో నున్నపదములఁ దీసికొని, మాటాడుకొనునట్లే వ్రాయనారంభించినారు. "కప్పా-పామూ" "పిల్లీ-యెలకా" ఇట్టి ప్రయోగములతోఁ గూడిన గ్రంథములు బయలుదేఱి

నవి. "కప్పయుఁ బాము" "పిల్లియు నెలుకయును" అనునవి చెవి కెబ్బెతికపుమాటలుగ వినఁబడినయెడల, 'కప్ప, పాము' 'పిల్లి, యెలుక' అని వ్రాయుట కేమియభ్యంతరమో తెలియకున్నది. ఈ చివరరూపములు చెవికా, మృదువుగనున్నవి. సౌలభ్యమునకా, పై వానికిఁ దీసిపోవు. లక్షణమునకా, వ్యతిరిక్తములుగావు. భాషాసంస్కర్త లనవసరముగా వ్యాకరణదుష్టరూపము లేల ప్రయోగింపవలెనో బోధపడకున్నది. మాటాడునట్లే వ్రాయవలెనన్న, జాతికొకభాషయు, జిల్లాకొకభాషయు నేర్పడవలసివచ్చును. ఈవిషయమునుగూర్చి వ్రాసివ్రాసి, వినివిని ప్రజ లిదివఱకే విసిగియున్నారు. కనుక నింతకంటె నిచట విపులముగ వ్రాసి వారల బాధపెట్టఁదలఁచుకొనలేదు.

పిల్లలకు వ్రాయుపుస్తకములలో భాష యెట్లుండవలయునో నా యభిప్రాయ మించుక చెప్పెదను. భాష సులభముగ నుండవలెను; కాని నియమరహితముగను వ్యాకరణవిరుద్ధముగను నుండఁగూడదు. బహుసత్కవి ప్రయుక్తములగు పదములును రూపములును (ప్రమాదములుగావు) గ్రాహ్యములనుకొనవచ్చును. ఇదివఱకు గ్రంథస్థములుగాక, గ్రంథస్థపదరూపములకు విరుద్ధములుగాక వ్యావహారికభాషలో నున్న సమస్తపదజాలమును బుస్తకములలో నిరాక్షేపముగా వాడుకొనవచ్చును. అట్లుచేయుట కేలక్షణగ్రంథమును నడ్డువచ్చునని తోఁపదు. "నాగరకత యభివృద్ధియగుచున్నది. క్రొత్తపదార్థములు, క్రొత్తయంత్రములు బయలుదేఱుచున్నవి. వానినిగూర్చి చెప్పుట యెట్లని భయమందనక్కఱలేదు. ఆయాయన్యభాషాపదముల కిదివఱకే మన భాషలో మాటలున్నసరే, వానిని స్పష్టీకరింపఁగల సులభసంస్కృత పదములున్నను సరే, లేనిచో నింగ్లీషుపదములనే యామట్టునఁ దెలుఁగులో వాడుకొనుటకుఁ బూర్ణాధికార మాంధ్రవైయాకరణులు మనకు

దయచేసినట్లు కనఁబడుచున్నది. కాని "వాడి కెంత ఫ్రీక్వెంటుగా ఎక్స్ప్లెయిన్ చేసినా అండర్స్టాండు చేసుకోలేడ" నుట మాత్రము వికారముగాను హాస్యాస్పదముగాను నుండును. ఇట్టివాక్యములు మనవారి నోటినుండి వినుచున్నాము. కనుక నీయుదాహరణమిచ్చితిని. మన్నింపవేఁడెదను. వ్యాకరణనిర్దిష్టరూపము లనేకములున్నచో, వానిలో వ్యావహారికరూపమునకు మిక్కిలి సమీపముగానున్నదే యెంచి వాడవలెను. 'వనంబు' 'వనమ్ము' వీనికి మాఱు 'వనము' అని వ్రాయుట యుక్తము. ఇప్పుడు వాడుకలోలేని ప్రత్యయాదులు—పొంబె, బండె, వెండి—మొదలగునవి పిల్లలకై వ్రాయుపుస్తకములలోఁ బ్రయోగింపకుండుట మంచిది.

ఇఁక బాలపఠనగ్రంథార్థవిషయములఁగూర్చి నాకుఁ దోఁచినరీతి మనవిచేసికొనెదను. పుట్టినదాదిగా నక్షరాభ్యాసము చేయువఱకు శిశువు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణేంద్రియద్వారమునఁ బ్రపంచజ్ఞానమును సంగ్రహించుచునే యున్నాఁడు. కొలఁదిగనో గొప్పగనో మనసు కూడఁ బనిచేయుచునేయున్నది. మనము పుస్తకములమూలమున నా జ్ఞానమును బలపఱిచి విపులముచేయవలెను. కనుకఁ బ్రథమమున స్థూలప్రపంచానుభవము నిచ్చుపాఠములను మిక్కిలి సులభములయిన మాటలతో వ్రాయవలెను. తఱచుఁ బిల్లలుచూచు జంతువులనుగూర్చి, మొక్కలనుగూర్చి, ఇతరపదార్థములఁగూర్చి చిన్నచిన్నవాక్యములు వ్రాయవలెను. ఇంద్రియములలో నయనేంద్రియము జ్ఞానసంపాదనమునకు మిక్కిలి సహకారి. దానిసాహాయ్యమునఁ బిల్లవాఁడు బడిలోఁ జదివిన పాఠములలోని యంశములను బరికించి, సరిపుచ్చుకొని, బాగుగా జ్ఞప్తిలోనుంచుకొనుటకు వీలుకలుగఁజేయవలెను. అట్టిపాఠములు బాలుర కానందజనకములై మనఃక్లేశము నీయవు. అట్టిని జంతువృక్షాది

శాస్త్రములయందలి కఠినవిషయములను బోధింపుమని నాయభిప్రాయమెన్నఁటికిని గాదు. అది వయోజ్ఞానములు ముదిరినపిమ్మటఁ జేయవలసినపని. దానికిప్పుడు పునాదివేయవలెను. కేవలము కన్నులతోఁ జూచి కాని చేతులతో స్పృశించికాని పిల్లలు తెలిసికొనుట కనువయినయంశములే, పాఠపుస్తకములలోఁ జేర్పవలెను. గుణపరియోజనసంబంధము సుబోధమయినయెడల వీలుననుసరించి చెప్పవచ్చును. "చిలుకముక్కు వంగి మొనదేలి యడకొత్తువలె నుండును. కనుకనే జామపండ్లలోని గింజల నది పటపట సులభముగాఁ గొఱుకఁగలదు." బాలుర వయోగ్రహణసామర్థ్యములఁ బరికించి యిట్టివి చెప్పినయెడల వారికి విద్య మనోహరముగా నుండును. సృష్టిలోని చేతనాచేతనవస్తువులఁ జూచి వానివానిగుణములఁ బరిశీలించి కార్యకారణసంబంధము కనుఁగొను నాసక్తి బాలురకుఁ గలుగును. ఇట్టి జ్ఞానతృష్ణయుఁ బరిశీలనశక్తియు బాల్యమునుండియుఁ బ్రబలియుండుటచేతనే పాశ్చాత్యులు పంచభూతముల వశపఱుచుకొని సృష్టికిఁ బ్రతిసృష్టి చేయుచున్నారు. సాధ్యమైనంతవఱకిట్టివిద్యయే మనబాలురకుఁగూడ నీయఁ బ్రయత్నింపవలెను. అదియే దేశమునకు బలప్రదము, లక్ష్మీప్రదము, యశోదాయకము. బాలుర కింద్రియము లుపగురువులు గావలయును. ఉపాధ్యాయుఁడే యుపబోధకుఁడుగ నుండవలెనన్నను దప్పుగాదు.

బాలురకుఁ బరిచితములయిన పదార్థములఁగూర్చి మొట్టమొదటఁ జెప్పి క్రమక్రమముగా, నపరిచయవస్తువులఁగూర్చియు నితరవిషయములఁగూర్చియు బోధింపవలెను. కేవలేంద్రియసాహాయ్యమున స్వతంత్రశక్తితోఁ బిల్ల లంతజ్ఞానమును సంపాదింపవలెనన్న ననేకజన్మములయినను జాలవు. ఏఁటేఁట, దినదినముఁ, బ్రకృతిశాస్త్రజ్ఞానము పార్వణాబ్ధివలెఁ బొంగుచున్నది. అట్టిజ్ఞాన ముపాధ్యాయుఁడు మితకాలము

లో నెన్నియో యుపాయములు పన్ని శిష్యులకు బోధింపవలెను. అట్లు చేయుటకు బొమ్మలు మిక్కిలి సహకారులు. బొమ్మలులేని వాచకపుస్తకము చిన్నవయస్సు విద్యార్థులచేతిలోఁ బెట్టుట మంచిదికాదు. ఆ బొమ్మలు జాగ్రత్తతో, సొగసుగా ముద్రింపవలెను. అవి ప్రకృతికి భిన్నముగా నుండఁగూడదు. అట్లుండిన విపరీతజ్ఞానము బాలురకు బోధించినవారమగుదుము. ఆకుపచ్చరంగుగల యావును వేసిన నట్టిదే యావురంగని కొందఱుబాలురు భ్రమపడవచ్చును. నిత్యము చూచుచుండుటచేఁ దెలివిగలపిల్లవాఁ డట్లుభ్రమపడకపోయినను, బుస్తకములసత్యమును బోధించునను నభిప్రాయమైనఁ జెందకుండఁడు. చూచు బొమ్మలకే యింతజాగ్రత్త కావలసినప్పుడు చదువుపాఠములమాట వేఱే చెప్పనక్కఱలేదు. శాస్త్రవిషయకపాఠములు బహుజాగ్రత్తతో దత్సంబంధమైన యనేకగ్రంథములు పరిశీలించి మఱి వ్రాయవలయును. చిన్నవయస్సులోఁ బడ్డ బోధనబీజములు పిల్లలమనస్సులలో శాశ్వతముగ నిలిచి మొలకలెత్తి శాఖోపశాఖలుగా విజృంభించి పెరుఁగును. జంతుతత్త్వమునుగూర్చికాని వృక్షతత్త్వమునుగూర్చికాని వాయుజలాది, పదార్థతత్త్వములఁగూర్చికాని చెప్పునప్పు డెంతజాగరూకత యున్నను నెక్కువగాదు.

మనదేశములోనున్న జంతువృక్షాదులఁగూర్చి వ్రాసినపిమ్మట, నీవిపులప్రపంచమందలి యితరదేశములలోనుండు వానినిగూర్చి చెప్పవలయును. చెప్పునప్పుడు సరియైన బొమ్మలఁ జిత్రించి, యాయా జంతువులకును తజ్జాతి స్వదేశజంతువులకును రూపగుణప్రయోజనములందుఁగల భేదములను స్పష్టముగాఁ బాఠమునందుఁ దెలియఁబఱచిన యెడల, బాలురు వాని నెప్పుడుఁ జూడకపోయినను భావనాబలమున గ్రహించుకొనఁగలరు. సత్యగ్రహణానుకూలమగు భావనాశక్తియు

బాలురకుఁ గ్రమక్రమముగా నభివృద్ధి చెందవలయును.

వాచకపుస్తకములలో నేకవిధమగువిషయములున్న, బాలురకు విసుగుపుట్టును. కనుక వివిధములగువిషయము లుండవలయును. కొన్ని చెట్లనుగుఱించియుఁ గొన్ని పక్షులనుగుఱించియుఁ గొన్ని మహానుభావుల చరిత్రలనుగుఱించియుఁ గొన్ని దేశపరిపాలనాపద్ధతులఁగూర్చియు—నిట్లు నానాముఖములుగాఁ బాఠములుండినచో బాలురకు వానిఁజదువ నభిరుచి యెక్కువగానుండును. ఎప్పు డాపాఠమువచ్చునా, యెప్పు డీపాఠముచెప్పుదురా, యని బాలురు కుతూహలపడుచుందురు. క్రొత్తబొమ్మలకై పిల్లలు పత్రములు తిరుగవేయుచుండుట, యుపాధ్యాయులెల్ల రెఱిఁగినవిషయమే. బొమ్మ వింతగానుండినప్పుడు దాని మూలవస్తువునుగుఱించి, యేమివ్రాయఁబడెనో చూతమను నుత్సాహము గలుగుట పిన్నలకేకాక పెద్దలకుఁగూడ సహజము. కనుక బోధకులకు బొమ్మ లెంతోసహకారులని పునరుక్తిగాఁ జెప్పవలసియున్నది.

పెద్దలకు నవరసభరితమగు గ్రంథ మెట్లెక్కువరుచించునో బాలురకు నట్లే యట్టిపఠనగ్రంథము మిక్కిలి రుచించును. వారిపుస్తకములలోఁగూడ యథోచితముగ రసభేదములు కనఁబడుచుండవలెను. కొన్ని కరుణరసప్రధానములయిన కథ లుండవలెను. కొన్ని హాస్యరసపూరితములగు సంభాషణము లుండవలెను. కొన్ని నీతి భక్తి బోధకములగు మహాత్ముల చరిత్రము లుండవలెను.

దైవభక్తి రాజభక్తి మొదలగు సద్గుణములు బాలురకు బోధింపవలెనన్నఁ జిత్రచిత్రకథారూపమునఁగాని, యుదారపురుషుల చరిత్రలమూలమునఁగాని, బోధింపవలెను. అంతేకాని, యుక్తిప్రయుక్తులతోఁ గూడి యుపన్యాసరూపముగ నున్నపాఠము లావయసునకు సరిపడవు.

జంతువులను మనుష్యులవలె మాటలాడించి చెప్పు "ఈసప్సు ఫేబిల్సు" వంటికథలు బాలుర కెంతో మనోహరముగ నుండును. మృగస్వభావములును బెక్కునీతులును వ్యవహారధర్మములును నందులో నిమిడియున్నవి. పురాణములందు చిన్న చిన్నకథలుకూడ మిక్కిలి ప్రయోజనకారులు. అవి సత్యములుగానిండు—అసత్యములుగానిండు-మన పూర్వసంఘస్థితులఁగూర్చియు, నాచారములఁగూర్చియు, రాజధర్మములఁగూర్చియుఁ బెక్కువిషయము లందులోఁ జెప్పఁబడియున్నవి. హరిశ్చంద్రుఁడు, శిబి, నలుఁడు, భీష్ముఁడు, ధర్మరాజు, శ్రీకృష్ణుఁడు, కుచేలుఁడు, ఆంజనేయుఁడు, శ్రీరామచంద్రమూర్తి, చంద్రమతీదేవి, దమయంతీదేవి, సీతామహాదేవి—ఇట్టి మహాపురుషులయొక్కయుఁ గాంతామతల్లులయొక్కయుఁ జరిత్రములు చదివిన నెవరికన్నులు నీరు గ్రమ్మకయుండును? ఎవనిశరీరములు పులకరింపకయుండును? అట్టివారిఁ గూర్చి సంగ్రహముగాఁ బ్రతి పాఠపుస్తకములోను వ్రాయుచుండవలెను.

ప్రకృతిశాస్త్రవిషయకపాఠము లావశ్యకములని యిదివఱకే వ్రాసియుంటిని. సామాన్యముగా మనము చూచుచుండు సూర్యచంద్రాదులఁగూర్చి కొంత బాలురకుఁ గఱపవలెను. నెలలెట్లుకలుగునో, దివారాత్రము లెట్లుకలుగునో, యీరోజీనక్షత్రము రేపానక్షత్రమన్న నర్థమేమో, చైత్రవైశాఖాదిమాసనామము లెట్లువచ్చినవో, ఋతువు లెట్లుకలుగుచున్నవో, గ్రహణకారణములేవో, చంద్రుని వృద్ధిక్షయములకు హేతువులేవో—ఇట్టివిషయములఁగూర్చి చెప్పి బాలురకు ఖగోళభూగోళశాస్త్రపరిచితి కొంచెము కలుగఁజేయవలెను.

ఎట్టిగాలి మంచిదో, ఎట్టిచోట్లయిండ్లు కట్టుకొనుటకు మంచివో, ఎట్టియాహారములు భుజింపవలెనో, ఎట్టినీరు త్రాగవలెనో, మురికికాలు

వలు మొదలగునవి యెట్లారోగ్యమును బాడుచేయునో, ఆరోగ్యభంగము కాకుండ నెట్లుకాపాడుకోవలెనో—ఇట్టి యారోగ్యశాస్త్రవిషయకపాఠములుగూడ నక్కడక్కడ నుండవలెను.

కృషిశాస్త్రసంబంధమైన పాఠములుగూడ నుండవలెను. ఏవి వ్రాసినను కేవల శాస్త్రపాఠములుగా వ్రాయఁగూడదు. సంభాషణరూపముననో, చిన్నచిన్న ముద్దుమాటలతోఁ జక్కని చిత్తరువులతో నున్న పాఠరూపముననో యీసంగతులు బాలురకు నేర్పవలెను.

ఇఁక బాలపఠనయోగ్యములగు పద్యపాఠములఁగూర్చి యించుక మనవిచేసికొనెదను.

మనశ్శరీరయోగ్యతాభివృద్ధికరమగు విద్యయే పూర్ణమైన విద్యయని చెప్పుమాట యథార్థము. అందు మనస్సుచేయు క్రియలనేకములు. ఇదిమంచి, ఇదిచెడ్డ, ఇదినిజ మిదియబద్ధ, మిది దీనికిఁగారణ మిదిగాదని తెలిసికొను వివేచనశక్తి దానిదే. దృశ్యపదార్థ జ్ఞానముఁబట్టి యదృశ్యవస్తుతత్వముఁ దెలిసికొనుభావనాశక్తియు దానిదే. వేయేల? సృష్టియంతయు మనోజన్యమని వేదాంతులు వచించునంత ప్రభావముగలది యది. పాఠశాలలలోఁ గఱపువిద్య దానియవయవముల కన్నిటికి, నంతర్భాగముల కన్నిటికిఁ బుష్టి నీయవలెను.

పరుల యనుభవములను దనయనుభవములుగా భావించుకొని వారిసుఖముల కానందించి కష్టములకుఁ గరఁగి కన్నీళ్లుపెట్టుకొనునది మనస్సు. దానినుబ్బించి, కరఁగించి, నవ్వించి, యేడిపించి, వలపించి, కోపగిల్లఁజేసి, కోఁతినాడించినట్లు లాడించువాఁడు కవి. అట్టివాఁడే కవియనఁదగినవాఁడు. అట్టివానిపద్యములే పద్యములు. కేవల చ్ఛందోబద్ధపదజాలము కవిత్వముగాదు. కాళిదాసునివంటికవి యేవిషయమునయినఁ దీసికొని వ్రాసి దానికి రసపుష్టి తేఁగలఁడు, కాని యది

సాధారణకవులు కసాధ్యము.

ప్రస్తుత బోధనశాస్త్రజ్ఞులలోఁ గొందఱు ప్రతివచనపాఠము క్రిందఁ, దప్పకుండఁ బద్యములుఁ బాటలునుండవలెననియు, నాపాఠము లో వచ్చుజంతువులను వస్తువులను బాలురచేత గీయించి చేయింపవలె ననియుఁ జెప్పుచున్నట్లు వినుచున్నాము. గీయించి చేయించుటవలన లాభమేకాని, తక్కినవారియభిప్రాయముతో నే నేకీభవింపఁజాలను. చిన్ననాఁటినుండియు బాలురు రసవంతములగుపద్యములకే, యలవాటు పడవలెను. సామాన్యకవుల కనుకూలములయిన విషయములు దొరకి నఁగాని పద్యములు రసవంతములుగా నుండవు. నీరసకవిత యేవయ సువారిలోను రసోత్పాదకము గానేరదు. గేదెపాఠముక్రింద నీయఁదగు పద్యమువంటి పద్యము వ్రాసిన నేమియు రసముగాని ప్రయోజనము గాని యుండదని నాయభిప్రాయము.

ఆ. నాల్గు కాళ్లు తోఁక ♦ నల్లని చర్మంబు
గాడెవంటి మేను ♦ గేదెకుండు;
గడ్డిమేసి కుడితి ♦ కడుపునిండఁగఁద్రావి
పేఁడవేసి గేదె ♦ పిడుకలిచ్చు.

ఇంక యతిప్రాసములు లేక, వ్యాకరణనియమములులేక, వ్రాయు నీక్రిందిపాటలవంటి పాటలమాట చెప్పనేయక్కఱలేదు. ఎంత హాస్యాస్పదముగా నుండునో చదువరులే తెలిసికొనఁగలరు.

కుడితి తాగెడున్, గేదె గడ్డి మేశెడున్,
మేశిమేశి తాగితాగి పేఁడవేశెడున్,
పేడపిసికి పిడకలెన్నొ చరుతు రందరున్
అవ్విగాక పాలుపెరుగు గేదెలిచ్చెడున్.

ఆనందము, అద్భుతము, జాలి, భయము, ప్రేమ, భక్తి మొద

ఁగునవి కలిగించువస్తువులును జంతువులునే కవిత్వమున కర్హములు. సూర్యబింబము, చంద్రబింబము, ఇంద్రధనుస్సు, పెద్దనది, పెద్దపర్వతము, సస్యభరితమయినచేను, ఉఱుములతో మెఱుములతో వర్షించుమేఘములు, కోకిల, చిలుక, నెమిలి, పూచినమల్లె, ఫలభరితమగువృక్షము- ఇట్టి వెన్నెన్నో బాలురపద్యములకుఁ బ్రశస్తములైన విషయము లున్నవి.

ఇఁకఁ జదువరుల బాధపెట్టఁదలఁచుకొనలేదు. ఆంగ్లేయభాషావిశారదులగు సోదరుల కొకచిన్నమనవి చేసికొని నావ్రాఁత ముగించెదను. సుష్ఠుగాఁ దెలుఁగువ్రాయఁగలిగినపండితుల కాంగ్లేయభాషాజ్ఞానము లేదు. ఆంగ్లేయభాషలో సముద్రమంత ప్రకృతిశాస్త్రజ్ఞాన మిమిడియున్నది. మహాపరీక్షలలో నుత్తీర్ణులయిన మన తెలుఁగువారికిఁ దెలుఁగునందుఁ బాండిత్యములేదు, అభిమానము లేదు. ఇఁక నెట్లాంధ్రభాషలో మంచిమంచి క్రొత్తగ్రంథములు తగినన్ని వెలువడఁగలవు?

నా కాంగ్లేయభాషలో నించుక ప్రవేశముగలదు. కాని ప్రకృతిశాస్త్రములు చదివి ప్రకృతిశాస్త్రపరీక్షలలోఁ గృతార్థుఁడనైనవాఁడనుగాను. చరిత్రగ్రంథములు విశేషముగాఁ జదివినవాఁడనుగాను. అంత పూర్వవయస్సులోవాఁడనుగాను. మనయాంధ్రులలో యౌవనవంతులు, బుద్ధిమంతులు, పెక్కు ప్రకృతిశాస్త్రములలోఁ బ్రపంచచరిత్రజ్ఞానములో నారితేఱి, గొప్పగొప్ప పరీక్షలనిచ్చినవా రనేకులుగలరు. మంచిమంచి యాంగ్లేయోపన్యాసము లీయఁగలరు వ్రాయఁగలరు. ఇదివ్రాసిన దాంగ్లేయుఁడా? యాంధ్రుఁడా? యని పఠితలు భ్రమపడు నాంధ్రజనవిరచితాంగ్లేయగ్రంథములుగూడఁ గొన్నియున్నవి. అట్టివారు స్వభాషలో నేల వ్రాయఁబూనుకొనరో, దురవగాహముగ నున్నది. ఆంధ్రభాషనుగూర్చి వ్రాసినను నింగ్లీషువ్రాఁతలే, యుపన్యసిం

చినను నాంగ్లేయోపన్యాసములే. ఇంగ్లీషుభావములకుఁ దెనుఁగుమాట లు తోఁపకవఁట! స్ఫురింపవఁట! వ్యాకరణము ప్రతిబంధమఁట! దానిని ద్రోసి పాఱవేయవలెనఁట. ఇవన్నియు యథార్థకారణములని నేననుకొనఁజాలను. నాకు నిజమని తోఁచినకారణములు చెప్పుమని సెలవైనఁ జెప్పెదను. ఇవిగో! విద్యార్థ్యవస్థలోఁ దెలుఁగు శ్రద్ధతోఁ జదువలేదు, వినలేదు. దరిదాపుగాఁ గాలమంతయు నింగ్లీషుభాషాపరిశ్రమమునందే వినియోగపడినది. పరీక్షలైనతరువాతఁ దెలుఁగుగ్రంథములు ముట్టుటలేదు సరిగదా, వానినిజూచినఁ బరమాసహ్యత. స్నేహితులకు సోదరులకు, నితరులకు వ్రాయునుత్తరము లింగ్లీషుభాషలో వ్రాయఁబడుచున్నవి. రోడ్డుమీఁద, రెయిలుస్టేషనుదగ్గఱ, మఱెక్కడనైన నిద్దఱుగూడిన, నింగ్లీషులోఁ బ్రసంగము. ఇంటిలోభాష యాంగ్లేయాంధ్రభాషామిశ్రమము. మాటలాడునట్లు వ్రాయునీయ రీదిక్కుమాలినపండితులని వారిని సభలలో నింగ్లీషుభాషతోఁ దిట్లు. ఇఁక మన మృదులాంధ్రభాషాంకుర మెట్లుబ్రదుకఁగలదు? నీళ్లులేవు, కంచెలేదు, గొడ్డటిపెట్లు! పాపము! శ్రద్ధలేదు, అలవాటులేదు. ఇవి నిజమైనకారణములు. ఈజబ్బులకు విఱుగుడు మనచేతిలోనే యున్నది.

మనజ్ఞానము ప్రజాసామాన్య మందంతట వ్యాపించినఁగాని దేశమభివృద్ధినొందదు. నానావిధసంస్కరణాభిలాషలు గలుగుచున్నవి. అన్నిటికి విద్య ముఖ్యము. ఆవిద్య కొలఁదిసంఖ్యవారికేయున్న, లాభములేదు. ప్రభుత్వమువారి నిదియిం డదియిండని ప్రార్థించిన, "ఈకోరికలన్నియు జనసామాన్యముయొక్క వాంఛలుగావు, ఇంగ్లీషుచదివిన నూఱు నూటయేఁబదిమందివే" యని వారు చెప్పుట కవకాశముకలదు. కనుక విద్యతోసోదరులారా! మీరార్జించినవిద్య క్రిందివారికి రావలెను. అప్పుడే మీయుదారవాంఛలు సఫలీకృతములౌను. మీవిద్య

వారికిఁ గఱపుట దేశభాషామూలముననేగాని యింకొకరీతిగఁ బొసఁగదు. కనుక దేశభాషాభిమానము మీకుండకతప్పదు. నిజమయిన యాభిమానము క్రియలతో నగపడకతప్పదు. మనవ్యాకరణమును, నలక్షణభాషయుఁ బెద్దపులులుగావు. ఎన్ని సంవత్సరము లాంగ్లేయభాషలోఁ గృషిచేసినారో యన్నిపక్షములు, కానిచో, నన్నినెలలు మనభాషలోఁ గృషిచేసి వ్రాయుట నారంభించినయెడలఁ జక్కఁగా వ్రాయఁగలరు. అట్లయిన శతసహస్రసంఖ్యాకములుగా సులభగ్రంథములు బయలువెడలి విద్యావ్యాప్తి కనుపడును. అప్పుడు మనమనోరథములన్నియు సిద్ధించును. "ఆంగ్లేయవిద్యావ్యాప్తివలన విశేషధనలాభమున్నది, తెలుఁగుపుస్తకములు వ్రాయుట కింతవిశ్వప్రయత్నముచేసిన లాభమేమి?" యందురా? నిజము—ధనలాభములేదు, కాని దేశమునకు గొప్పలాభమున్నదని మీకు నమ్మకములేదా? ధనరూపకమయిన ప్రోత్సాహముకూడ నిప్పుడు తక్కువగానున్నను దైవకటాక్షమునఁ గాలక్రమమున లభింపఁగలదు. మహాకార్యములకుఁ బ్రథమమునఁ జిక్కులెన్నో యుండునని చారిత్రజ్ఞులగు మీకుఁ దెలియని యంశముగాదు. ఒకసారి ప్రజలకు విద్యారుచి పొడచూపిన నిఁకవదలదు. అప్పుడు గ్రంథవిక్రయమున కాయధికారుల నీయధికారుల నాశ్రయింపనక్కఱలేదు. గ్రంథప్రాశస్త్యమునుబట్టి డబ్బువచ్చును. సద్గ్రంథములు నిలుచును. అసద్గ్రంథము లడుగంటును. అప్పుడు పాక్షికబుద్ధి దేశక్షేమమున కడ్డుపడదు. అట్టికాలమునకేకదా దేశశ్రేయోభిలాషులెల్ల రెదురుచూచుచున్నారు! ధనలాభమునకును, దేశభాషాసేవలకును బ్రారంభదశలోఁ గడుదూరము. అభయముగ మహోత్తమాంగ్లేయభాషాసమార్జితమహావిద్య మనభాషలోనికిఁ దీసికొనివచ్చుట మానివేసినయెడల, నదంతయు నడవినిఁగాసిన వెన్నెలవలె లోభియొద్దనుండు ద్రవ్యమువలె

నిరుపయోగమగును.

విద్యావ్యాప్తికై యనేకస్థలములఁ బుస్తకాగారములు స్థాపించుచున్నారు. చందాలు వసూలుచేయుచున్నారు. ఊరక యిమ్మనియడుగక, యాధనములోఁ గొంతవ్యయపెట్టి ధనవంతులుగాని వారిచే రచింపఁబడిన సద్గ్రంథములు గొనుటకు మనవారేర్పఱచుకొన్న యెడలఁ గొంత పైయనర్థము పోవును.

ఆంధ్రదేశ మత్యున్నతస్థితికిఁ గొలఁదికాలములోనే వచ్చుఁగాక! మకరందమధురమగు మనయాంధ్రభాష దినదినప్రవర్ధమానమై జ్ఞానమును, నీతిని, దైవభక్తిని, రాజభక్తిని, వెదచల్లుఁగాక!



శ్రీ రామా.

# ఆంధ్రభాష.

ఆంధ్రదేశమున కివి యదృష్టదినములు. ఆంధ్రోద్యమము ప్రబలుచున్నది. దేశాభిమానము వృద్ధియగుచున్నది. దేశాభిమానముతో భాషాభిమానమును దలయెత్తుచున్నది. తెలుఁగులో నుపన్యాసము లిచ్చుటయు, వ్రాయుటయు గౌరవభంజకము లనుదురభిప్రాయము లడుగంటుచున్నవి. అనేకులు ప్రబంధములు, నాటకములు, నవలలు, నుపన్యాసములు వ్రాయుచున్నారు. అనేకపత్రికలు బయలుదేఱుచున్నవి. బుద్ధిపూర్వకముగా భాష తాఱుమాఱుచేయవలయుననుతలంపు లున్నట్లిప్పు డంతగా నగపడుటలేదు. పత్రికలలోనిభాష శరత్కాలసరిన్నీరమువలెఁ గలఁకదేఱి క్రమక్రమముగాఁ గర్ణపేయమగుచున్నది. ఇవన్నియు దేశభాషాభ్యుదయచిహ్నములు గావా?

కాని, యింకను బెక్కువ్రాఁత లయోమయములుగ నున్నవి. పండితులు కఠినసమాసములును, వాడుక కతిదూరముగ నుండుమాటలును, రూపములును, వచనములలోఁగూడ వ్రాయుచున్నారనుమాట వాస్తవము. ఈయలవా టచిరకాలములోఁ బోవునను ధైర్యముమాత్రము నాకున్నది. అట్టివారిలోఁ బెక్కురు, కావ్యములకు—అందుముఖ్యముగా వచనకావ్యములకుఁ—బ్రసాదగుణము పరమోత్కృష్టగుణమని యిప్పుడిప్పు డొప్పుకొనుచున్నారు. అట్లొప్పుకొనుటయే తరువాయి; కఠినముగా వ్రాయఁగలవారికి సులభముగావ్రాయు టంతదుర్లభము గాదనుకొనెదను. ఎంత కఠినముగా వ్రాసినను వారిది తెలుఁగనుట కెవ్వరు సందేహింపరు. పదముల కర్థముతెలిసినతరువాతనైన భావము

బోధపడుననుట కనుమానములేదు.

ఆంగ్లభాషాప్రవీణు లగుకొందఱచే వ్రాయఁబడుచున్న కొన్ని యాంధ్రగ్రంథములు నాంధ్రవ్యాసములు నంతకంటెఁ గష్టతరములుగఁ గాన్పించుచున్నవి. ఈకష్ట మొకవిచిత్రమైనకష్టము—అక్షరములు తెలుఁగువి. పెక్కుమాటలును దెలుఁగువే. 'కామాలు' మొదలగునవి కావలసినన్ని. కాని యెంత తలబ్రద్దలుగొట్టుకొనినను నర్థము విడఁగొట్టలేము. గ్రంథకర్తభావమేమో గ్రంథకర్తకే తెలియవలెను గాని యన్యుల కగోచరము. ఇట్టి యర్థముకానిభాష యాంధ్రాక్షరసమన్వితమైన యన్యభాషగాఁ దోఁచుననుట యసత్యముకాదు.

ఇట్టి విపరీతవచనరచనలు చూచునదృష్టమో దురదృష్టమో పెక్కుసార్లు నాకుఁ దటస్థించినది. అర్థము స్ఫురింపక తెల్లమొగము వేసితిని. పూర్వాభ్యస్తములైన యాంగ్లేయవచనములు స్మృతికిరాఁగాఁ గొంతయర్థము మసకమసకగా మనస్సునకుఁ దోఁచినది. కొన్నివాక్యములు పండితులపాషాణపదప్రయోగముల తలఁదన్ని బృహస్పతిభేద్యములుగఁ జూపట్టినవి. ఒకవేళ నాబుద్ధిమాంద్యముచే నవి యట్లున్నవేమోయని బహుసద్గ్రంథకర్త యగునొకమిత్రునికిఁ జూపితిని. నాకంటె నాయన యెక్కువయేమియు నగపడలేదు. పలువురువిద్వాంసు లిట్లే బాధపడిరి. విద్వాంసులకే యట్లుండ విద్యార్థులమాట చెప్పనక్కఱలేదు. కనుక వారితలలోనే యేదోలోప ముండవలెనని తుదకు నిర్ధారణ చేసికొంటిని. నిర్ధారణ నిరాధారముకాదు.

ఆంగ్లవిద్యాసంపన్నులకు భాషాభిమాన మంకురించి యభివృద్ధియైనకొలఁది నాభాషలో నుండువిపులవిషయజ్ఞానప్రపంచమును తమభాషలోనికిఁ దీసికొనివచ్చి తన్మూలమున నాంధ్రజనకోటి కమూల్యమైనజ్ఞానమును నాగరకతయు నలవడఁజేయుకుతూహలము వారికిఁ గలు

గుచున్నది. ఇది మిక్కిలి స్తవనీయమైనయభిలాష. మనపురోభివృద్ధి కిదియొక శుభసూచన.

కాని సముద్రతరంగములవలె నెడతెగక వచ్చుమనోభావముల నద్దమెదుటఁ గట్టినట్లు వ్రాసి జనసామాన్యమునకు బోధించుటకుఁ దగినంత యాంధ్రభాషాపరిచితిలేదు. లేకపోవుటకుఁ గారణము లేకపోలేదు. ఇదివఱకుఁ బాఠశాలలోఁ జేసినయాంధ్రభాషాపరిశ్రమము మిగులఁ దక్కువ. మొన్నమొన్నటివఱకు "స్కూలుఫైనలు" లోనైన నందఱు నుష్ఠుగాఁ దెలుఁగుపఠింపవలెననునియమము లేదయ్యెను. ఆంధ్రభాషాసంపర్కమేమియులేకుండనే బి.ఏ. మున్నగుపరీక్షలలో నుత్తీర్ణులైనవారు పెక్కురున్నారైరి. ఇదిగాక యుత్తరములన్నియు రాజభాషలోనే లిఖించుట, వీథులలోఁ గనఁబడినమిత్రులతో నింగ్లిషులోనే ప్రసంగించుట, సభలలో నాంగ్లేయభాషతోనే చర్చించి తీర్మానములుచేయుట, యిండిదగ్గఱనైనఁ మాంగ్లాంధ్రమిశ్రభాషను బ్రయోగించుట, యింకను బూర్తిగాఁ బోలేదు. వేయేల? యితఃపూర్వము శ్రద్ధలేకపోయినది. అలవాటంతకంటె లేకపోయినది. ఈరెండే యీయనర్థములకు మూలకారణములని నాదృఢాభిప్రాయము.

వమనము లాఁపికొనలేనట్లే, తెరలుతెరలుగ వచ్చువివిధమనోభావముల నాఁపికొనలేక యేభాషలోనో యొకభాషలో వెడలఁగ్రక్కుచున్నారు. భావములు దివ్యములు (చదువువారికిఁ దెలిసినయెడల). భాష తెలుఁగక్కరములతో వ్రాసినకోయభాష. ఈభాష నవరించుకొనినఁగాని తెలుఁగున కొకనవీనోపద్రవము సంభవించునేమోయని భయమగుచున్నది. అది యేమిప్రారబ్ధమోకాని మనతెలుఁగు తెగుళ్లమూరి తెలుఁగైనది. అయిననేమి? మన మించుకజాగరూకతతోఁ బ్రవర్తించినయెడల మనకాలములోనే మఱల మనభాష మధురాంధ్రభాష

కాకపూనదు. చికిత్సాసాధనము లేదో మనవిచేసికొనెదను.

1. మనసులో నుదయించుకల్పనలను, భావములను, దెలుఁగుతోనే రానిచ్చుట. ఒకయింగ్లీషువాక్యమును జిత్తములోఁ దలపోసికొని దానిని బిమ్మటఁ దెలుఁగులోనికిఁ దర్జుమాచేయుట మంచిదికాదు. అట్లుచేయక తప్పనియెడల, మనము వ్రాయుతెలుఁగువాక్య మాంగ్లభాషాజ్ఞానములేని స్త్రీబాలవృద్ధులకు స్పష్టముగాఁ దెలియునా తెలియదా యని యోజించుకొని తరువాత దానిని గాకితముమీఁది కెక్కింపవలెను. ఇట్లుచేసినఁ గొంతయనర్థము నివారితమగును.

2. సుగ్రహము లగుసంస్కృతాంధ్రపదములు లభ్యముకానిచోట్ల నాంగ్లేయాద్యన్యదేశ్యములే యుపయోగించుట యుత్తమము. మన వ్యాకరణ మట్టిపదములు యథేచ్ఛముగా వాడుకొనుటకు మనకధికారమిచ్చుచున్నది. 'బైసికిల్' అనుదానికి 'ద్విచక్రశకటము' నియు 'ట్రాం బండి'కి 'విద్యుచ్చోదితశకట' మనియు పేర్లుపెట్టిన,నవి చెవికిని జిత్తమునకుఁగూడ రుచింపవు. 'తహస్సీల్దారు' నకు ద్రవిడప్రాణాయామముగా నొకదీర్ఘసంస్కృతసమాసమును గల్పించి వ్రాసినఁ జదువువానికిఁ దలనొప్పివచ్చును. రచనాసౌలభ్యమునకు భంగము కలుగును.

3. అన్యభాషాగ్రంథములు తర్జుమాచేయవలెనని యున్నయెడల వాక్యమును ముక్కకుముక్కగా నాంధ్రీకరించుట హాస్యాస్పదముగ నుండును. దానిసారమును గ్రహించి యది యెట్లు తెలుఁగులోవ్రాసిన భావము పదిమందికి స్పష్టమగునో చూచి యట్లు వ్రాయవలెను. "No pains, no gains" అనుసామెతను 'లేనిశ్రమ, లేనిలాభము' అనికాని 'శ్రమములేదు, లాభములేదు' అనికాని తర్జుమాచేసిన వికారముగనుండుట సరికదా అర్థము స్పష్టముగాదు. "కష్టపడినఁగాని ఫలములే" దనియో మఱియొకయుచితమైనరీతినో యాంధ్రీకరింపవలెను.

"There's many a slip between the cup and the lip" అనుదా-
నికి 'గిన్నెకును పెదవికిని నడుమ ననేకములైన సజాఱు లుండును' అని వ్రాసిన, మూలము దెలియనివాని కెవనికర్థమగును ? 'చేతనున్నది నోటఁబడునో లేదో చెప్పలే' మనియో 'హస్తగతమైన దంగుటిఁజేరక ముం దనేకవిఘ్నము' లనియో వ్రాసిన నందఱకుబోధపడును. మూలమునందలిరసముఁ జమత్కారముఁ గొంతతగ్గిపోయినఁబోవుఁగాక. అర్థము కాకపోవుటకంటె నదిమెఱుఁగుగాదా? దేశీయమర్యాదలును భాషీయసంప్రదాయములునెంచి తర్జుమాప్రయత్నములు చేయవలెనని నాప్రార్థన.

4. మాఱుమూలపదములును బ్రచురప్రచారములేనిప్రయోగములు నెట్టర్థగ్రహణావరోధకములై యెబ్బెటికము పుట్టించునో నియమరహితమైనవ్రాఁతలుగూడ నట్లు రోఁతగలిగించును. వ్యాకరణోల్లంఘనమునకు వెఱవవలయును. అర్ధానుస్వారశకటరేఫము లుపయోగించువా రతిజాగరూకులై వాని వేయవలెను. అవి యుండవలయుచోట లేకుండుట, యుండఁగూడనిచోట నుండుట బాలురకు మిక్కిలియనర్థదాయకము. తప్పుచోట్లఁ బెట్టుటకంటె గ్రంథములలో వానికిఁ దావీయకుండుటయే మంచిది.

తెలుఁగువ్యాకరణము సమగ్రముగా లేదన్నమాట నిజము. ఆ లోపము భాషాభిమాను లగుప్రస్తుతకాలపుఁబండితులవలనను బ్రభువర్యులవలనను దీఱవచ్చును. సంపూర్ణవ్యాకరణము సమకూడువఱకు నసంపూర్ణలక్షణగ్రంథముల నావలికి సాగనంపఁగూడదు. ఆంగ్లేయభాషలోని పెద్దనిఘంటువులందువలె నాంధ్రపరిషత్తువారు, రాఁబోవువారి గొప్పతెలుఁగునిఘంటువులో, సోపవిభక్తికానోపవిభక్తికాదిభేదములును, ముఖ్యమైనవ్యాకరణాంశములును సూచించి వేనవేలుగ బయలు వెడలుచున్న యాంధ్రగ్రంథరచనాభిలాషులకు మహోపకారము

చేయఁ బ్రార్థితులు.

5. ఇఁక నొకవిషయముఁగూర్చి కొన్నిమాటలువ్రాసి యీచిన్నవ్యాసమును ముగించెదను. కొంచెము సంస్కృతజ్ఞానమైనలేక మంచి తెలుఁగువ్రాయుట కష్టము. తల్లిపిల్లలకుండుసంబంధమే గీర్వాణాంధ్రభాషల కున్నది. సంస్కృతపదములేకుండ నొకగడియ మాటలాడలేము. ఒకపఙ్క్తి వ్రాయలేము. తద్భవము లనివాడఁబడునవికూడ సంస్కృతజన్యములే. సిద్ధాంతకౌముది చివరవఱకుఁ జదివినఁగాని తెలుఁగు వ్రాయఁగూడదని నాయభిప్రాయముకాదు. కాని సాధారణముగా నాంధ్రగ్రంథోపయుక్తము లగుసంస్కృతసంధులఁగూర్చియు, సమాసములఁగూర్చియు, శబ్దాంతములఁగూర్చియుఁ, దద్ధితములఁగూర్చియు నాంధ్రగ్రంథరచనాకుతూహలుఁ డించుక యెఱుఁగవలెను.

ఈకట్టుపాట్లు తెలియనికవి సంస్కృతభాషనుగూడఁ బాడుచేయును. దుష్టమిశ్రసమాసములు మున్నగునపప్రయోగములు పెక్కిప్పటివారివ్రాఁతలలోఁ గాన్పించుచున్నవి. “అనేకచిక్కులు, తలిదండ్రులు, గౌరవనీయులు, తపోఫలము, ఆధిక్యత, ప్రావీణ్యత, అతికారము, బలవంతవిరోధము,” ఇట్టివి తఱచు చూచుచున్నాము.

బడులలోఁ దెలుఁగు బోధించునుపాధ్యాయు లాంధ్రవ్యాకరణవిషయములతోఁ గొన్నియావశ్యకము లగుసంస్కృతనియమములుగూడ బాలురకుఁ జెప్పిన, వారు పెద్దవారై వ్రాయుగ్రంథములు నిర్దోషములుగ నుండును.

శ్రద్ధఁబూని సద్భాషలో గ్రంథములు వ్రాసి యున్నవారాదులకుపకారముచేయుఁడని భాషాభిమానులఁ బ్రార్థించుట కీవ్యాసము వ్రాసితినిగాని లేనిపోనితప్పులు వెదకి చూపి వారి కుత్సాహభంగము గావించుటకు వ్రాయలేదని విన్నవించుకొనుచున్నాను.

---

# వర్ణవిభాగములు—వర్ణవిద్వేషములు.

ఏదేశమునందైనను జనులందఱు సమానగౌరవము నందుచుండుటలేదు. కొందఱు తెక్కువవారుగను కొందఱు తక్కువవారుగను పరిగణింపఁబడుచున్నారు. అధికగౌరవమునకు బుద్ధివిశేషమో, విద్యాపాటవమో, యోగ్యతాగరిమమో, ధనసంపత్తియో, జన్మానైక్యమో, బలపరాక్రమ ప్రభావాతిశయమో కారణమగుచున్నది.

మనపరిపాలకుల దేశములో, ముఖ్యముగా, ధనమే గౌరవమునకు మూలమైయున్నదని చెప్పవచ్చును. "సర్వేగుణాః కాంచనమాశ్రయంతి" అనువాక్య మచట సత్యమగుచున్నదని చెప్పుట యసత్యముగాదు.

మనదేశమందు ధనగౌరవము లేకపోలేదుగాని, విశేషముగా కులగౌరవము చిరకాలమునుండి చూపఁబడుచున్నది. నిర్ధనుఁడైనను, విద్యావిహీనుఁడైనను, అయోగ్యుఁడైనను, బ్రాహ్మణుఁడు జన్మమాత్రముననే మొన్నమొన్నటివఱకు సంఘసమాదరణపాత్రుఁడై యుండెను. "గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం" ఇత్యాదివాక్యములంబట్టి, మనదేశములో, సమస్తసద్గుణములును పూజ్యతయును కులము నాశ్రయించుకొని యున్నవనుట తప్పుగాదు.

దేశము మన వర్ణాశ్రమధర్మములులేని యనేకపరరాజులబారిఁబడినను, ఈకట్టుపాట్లు అంతకంతకు గట్టిపడినట్లు కనఁబడుచున్నవిగాని సడలిపోయినట్లు కాన్పింపవు. ఎందుచేత? వానిలో నేదో యంతశ్శక్తి యుండియుండవలెను. క్రిందిజాతివారు పైజాతివారిని పూజించుచు,

పై జాతివారు స్వార్థత్యాగులును పరోపకారపరాయణులును, నీతిప్రి ధానులునయి క్రిందిజాతివారిని వేయికన్నులఁ గనుపెట్టిచూచి జ్ఞానోపదేశములఁజేయుచు కేవల ప్రాణధారణమునకుఁ గావలయు ప్రపంచలాంపట్యముతోనే కాలము గడపుకొనుచు ఉన్నందువలన, వర్ణభేదములున్నను (అట్లననేల ? వర్ణభేదములచేతనే) కొంతకాలము దేశ మభ్యుదయ పరంపరాభివృద్ధి నందియుండవచ్చును. అట్లున్నట్లు పురాణములలోఁ బెక్కునిదర్శనములు గలవు. బ్రాహ్మణులసత్యశీలత, ధర్మతత్పరత, స్వసుఖవిముఖత, మున్నగు ఉదారగుణములను చాటు ఉపాఖ్యానము లనేకములున్నవి.

శాంతిపర్వములోని సుద్యుమ్నోపాఖ్యానము చూడుఁడు. క్షుద్బాధచే లిఖితుఁడు తోఁటలోనిపండ్లు కోసికొని తిని తాఁజేసినపని యన్నయగు శంఖునితోఁ జెప్పెను. స్వామి యంగీకృతిలేక యతనిసొత్తు హరించితివిగాన వెంటనే రాజుకడకేగి నీచేసిననేరము చెప్పి చౌర్యమునకు విధింపఁబడినశిక్ష నొంది మరణానంతరానుభావ్యమైన ఘోరయమదండనము తప్పించుకొనుమని అన్న తమ్మునితోఁ జెప్పెను. ప్రభువగు సుద్యుమ్ననొద్దకు లిఖితుఁడు చని నిజదోషము నెఱిఁగించి శిక్షాభిక్ష నర్థించెను. నీయట్టియుత్తమబ్రాహ్మణుని శిక్షింపలేనని ప్రభువు ప్రత్యుత్తరమిచ్చెను. పరలోకబాధనుండి రక్షించు ప్రస్తుతదండన ముపకృతిగాని యపకృతిగాదని యతఁడు నొక్కి మనవిచేసికొనెను. మార్గాంతరములేక మహాదుఃఖభరితమైన మానసముతోఁ దత్కాలశిక్షాస్మృతి ననుసరించి, రాజు, చేయలేక చేయలేక, లిఖితుని ఖండితబాహుని చేసెను.

నికృత్తకరుఁడై యతఁడు నిజసోదరునొద్దకుఁజని జరిగినదంతయు విన్నవించెను. శంఖుఁడు దానికి సంతాపించుటకుమాఱు సంతోషించి

సమీపమునకున్న నదిలో స్నానముచేసి పితృతర్పణము చేసికొనుమని సహోదరునితోఁ జెప్పి పంపెను. పోయి యతఁడట్లుచేయఁగా పోయిన చేతులు మరల వచ్చెనఁట. ఆనదికి 'బాహుద' యని పేరువచ్చెనఁట. బాహుదానది యన్వర్థనామమా కాదా యనునది యిటఁ జర్చనీయాంశము కాదు. కాని యన్న నిశ్చలధర్మబుద్ధియు నిర్మమతాగరిమయు నెక్కువ ప్రశంసనీయములా, తమ్ముని ధర్మశీలతయు, భాతృభక్తియు, నెక్కువ ప్రశంసనీయములా యనువిషయ మాలోచనలోఁ బెట్టుకొని యానందించుట ప్రయోజనకారి కావచ్చును. ఇవి యర్థవాదములనుఁడు; హితబోధార్థము కల్పించి వ్రాసిన యితిహాసములనుఁడు. ఎట్లున్నను ఇట్టినీతికథ లనేకములు పురాణములందున్నవి.

ఉత్తమోత్తమమైన నీతికిని ఉత్కృష్టధర్మములకును కట్టుపడి యున్నంతకాలమును బ్రాహ్మణులు ప్రపంచమంతకును పరమపూజ్యులై యుండిరనుట యొకవింత కాదు. ఈకాలములో పరిహాసాస్పదముగా నుండు "బ్రాహ్మణో మమ దేవతా" యను శ్లోకభాగము ప్రజలు ప్రత్యక్షప్రమాణముగాఁ బరమసత్యమని కనుఁగొన్నకాల మొకప్పు డుండెను.

కాని ప్రస్తుతకాలపుబ్రాహ్మణులు, వారిపూర్వుల సుగుణసంపత్తి దాదాపుగా నంతయు గోల్పోయిరనుట యనుభవసిద్ధము. ఇతర జాతుల పూర్వనైర్మల్యముమాత్ర మిప్పుడు నిలిచియున్నదా? యని యడుగవచ్చును. ఎట్లు నిలువఁగలదు? తలబలము తొలఁగిపోయినఁ దక్కినయవయవములు మాత్రము సుస్థముగా నుండునా?

యోగ్యతలేదు. ఆముష్మికచింత అంతకంటెలేదు. "సరే; లేకపోయిననేమి? జాతినిబట్టి మాకు రావలసినగౌరవము మాకు రావలెను" అని బ్రాహ్మణులందురు.

"పోట్టచింపినను అక్షరములేదు. పరోపకారముమాట యేటుంతము. ఉదరపోషణమునకైనను ఉచితమగు పరిశ్రమములేదుగదా! పండించుశ్రమ మాదియు, పండించినది తేరగాఁదెచ్చుకొని మ్రింగుటకుమాత్రమే పశుశ్రమ మీాదియునా?" అని బ్రాహ్మణేతరు లందురు.

"జాతిసాంకర్యముచే ఈవిపరీతబుద్ధులు పుట్టుచున్నవి" అని యొకఁడును "పూర్వముమాత్రము జాతులెల్లప్పుడు స్వచ్ఛముగా నుండెనా?" అనియొకఁడును విరసవాదములుకూడ ఆడుకొనుచున్నారు.

"అయ్యయ్యో! పూర్వపుబ్రాహ్మణు లెంతవిద్యాసంపన్నులు! వారులేకుండిన ఇప్పు డీవేదవేదాంగములన్నియు నిల్చియుండునా? అట్టి యుత్తమజాతివారి నవమానించు టతిపాపముగదా!" అని కొందఱను చున్నారు.

"పూర్వమెప్పుడో పుష్కలముగా పండ్లిచ్చినది పాప! మని పుల్లవిఱిగిపోయిన తీయమామిడిచెట్టునకు నిరర్థకముగా నిత్యము నీళ్లుపోసి యెవరుపోషింతురు?" అని కొందఱనుచున్నారు.

సంఘములో నిట్టియంతఃకలహములు సంభవించినవి. ఇవిట్లుండఁగా—"బ్రాహ్మణులమీఁదికి బడితలు పట్టుకొని మీరు బయలుదేఱుచున్నారు సరేకాని, మాకు వారికంటె మీరొలికించుచున్నసుఖ మేమున్నది? మాబాధముందఱ మీాబాధ యెంత? మీాకొక్క బ్రాహ్మణబాధయేకాని మాకు బాధ నాలుగుప్రక్కలనుండియు వచ్చుచున్నదే! మేము అస్పృశ్యులమఁట! ఎంతతక్కువవారమైనను మనుష్యగణములోఁ జేరినవారమనుట నిస్సంశయముగదా! కాకులకంటెను పిల్లులకంటెను కనీసమైతిమే! మన దిక్కుమాలిన ఆర్షమతమువదలి ఆంగ్లమతమో అరబ్బీమతమో స్వీకరించుటతోడనే యస్పృశ్యతయంతయు అదృశ్యమై గౌరవార్హులమగుచున్నామే? ఇది మతమా? మదమా? ఉ

న్మోదమా? ఇది సదాచారమా? మూఢాచారమా? ఇట్టియాచారము వలన హిందుమతము నానాఁటికి సంఖ్యాక్షయమందుచుండి కొన్నియేండ్లలో శల్యమాత్రావశిష్టమైపోదా?" అని యొకమూలనుండి పంచములు పరిపరివిధముల పరితపించుచు మొఱలిడుచున్నారు. వీరి మొఱలుమాత్రము హృదయశల్యములై యందఱను ఏఁచుచున్నవి. భేదోపాయ విశారదులు తమరొట్టె నేతిలోఁబడినదని పరమానందభరితులై లోలోపల కికాకికలుగా నవ్వుకొనుచున్నారు. గృహాహారవిహారములందు శుచిత్వమలవడిన, అస్పృశ్యత అఱనిముసములో అదృశ్యమైపోవునని ఒకరనుచున్నారు. జాతికి గౌరవము కనఁబఱచుచున్న, శుచిత్వము తనంతటతానే వచ్చునని మఱియొకరనుచున్నారు. పెండ్లియైనఁగాని వెఱ్ఱితీఱదు. వెఱ్ఱితీఱినఁగాని పెండ్లిగాదు. ఈయన్యోన్యాశ్రయబాధ యెట్లు తొలఁగునో తెలియదు.

ఇంతకు, వర్ణాశ్రమవిహితధర్మములు పరమార్థసాధనములా, పరమార్థములేనా? పూర్వకాలములో ఎట్లున్నను, ఈకాలములో అవి యట్టిసాధనములుగా నుపయోగపడుచున్నవా? ద్వేషకారణములుగను, ఐకమత్యభంజకములుగను, అహింసాసహనసత్యశమదమపరోపకారాది మహోదార నీతిధర్మములకుఁ బ్రతిబంధకములుగను పరిణమించుచున్నవా? వర్ణాచారములు తొల్లిటియట్లే యున్నవా? మంచికో చెడ్డకో దేశకాలానుసారముగ మాఱుచున్నవా? వివిధాచారములు విధించు స్మృతులు ఆవశ్యకతనుబట్టి అప్పుడప్పుడు సవరింపఁబడుచుండెడివా, సర్వకాలసర్వదేశోపయుక్తమగునట్లొక్కసారియే శిలాక్షరములుగా స్థిరపఱుపఁబడినవా? విహితనిషిద్ధధర్మములు దేశకాలానుకూలములుగ వినిమయము నొందుచుండెడివా? శాంతిదాంతితితిక్షాసత్యాదులవలె శాశ్వతములై యుండెనా? జాతిలోను నీతిలోను ఏది యెక్కువ

ముఖ్యము? ఏది యెక్కువగౌరవార్హము? వర్ణవిభాగములు గుణకర్మానుసారములై సర్వదేశసర్వజనసామాన్యములైన స్వాభావికవిభాగములా? కేవల జన్మనిష్ఠములై మనహిందుదేశమునకుమాత్రమే యనుకూలించు కృత్రిమవిభాగములా? ఈవిషయములు సంఘములోని పెద్దలు నిష్పక్షపాతబుద్ధితో ప్రజాశ్రేయోభిలాషతో పరిశీలించి వలయు మార్పులు చేయుట దేశద్రోహమా, దేశోపకారకృత్యమా?

"వేదోపనిషత్స్మృతు లెట్లున్న మాకేమి? మాబుద్ధియే మాకుఁ బ్రమాణము. తాత్కాలికమో, సార్వకాలికమో, ఐహికమో, యాముష్మికమో, శరీరభోగములే మాకు సర్వసుఖములును" అని సనాతనస్వమతాభిమానదూరులై దెప్పుపరదేశబాహ్యవేషభాషాడంబరవిమోహితులమాట వినుట మంచిదికాకపోవచ్చును.

కాని మనమతగ్రంథములు బాగుగాఁ బఠించి, సద్గురుశిక్షితులై, అనేకయోగసాధనములచేతఁ బరిపాకమందిన చిత్తము గలిగి, అనుభవముచే వేదాంతవాక్యములు సత్యములని తెలిసికొని, "భగవంతునికి భరతఖండముపైని పాక్షికము, ఒకవేదమతమే భగవద్దత్తమైనమతము, జాతివిహితబాహ్యకర్మాచరణమే మోక్షసాధనము, ముముక్షువులగువారందఱును పరిపాకదశలో హిందూదేశమునఁ బుట్టకతీఱదు" అని వాదించు కూపస్థమండూకములవలెఁగాక సర్వమతగ్రంథములు సమబుద్ధితోఁ జదివి నాగరకశిఖామణు లనుకొనఁబడువారుండు నానాదేశములు స్వయముగాఁ జూచి, తత్తన్మతాచారముల నెల్ల సూక్ష్మదృష్టితోఁ బరికించి పరిశీలించి, అవి మనవానితోఁ బోల్చిచూచి, మంచిచెడ్డలను గనుఁగొని మనకుఁ జెప్పు మహానుభావులమాట వినిన మనము చెడిపోదుమా?

స్వప్రయోజనపరాఙ్ముఖులును శమదమాదిసంపన్నులును పో

సకారపరాయణులును అగు మనమహర్షులు పూర్వము, కాలానుసార ముగ ఆచారములు విధించెడువారనియు, మనమతస్థులైన ప్రభువులు ప్రజాహితైకనిరతులై వానినంగీకరించి జరిపించి జరపనివారిని దండించెడువారనియు విజ్ఞులు చెప్పుదురు.

ఇప్పుడు మనప్రభువులు మనమతమువారు కారు. మతవిషయములందు తటస్థులమై యుందుమని వారు చెప్పుదురు. కాని ఉల్లమొకించుక స్వమతముపై నొఱగఁబడక మానదు. అదిమనుష్యస్వభావము.

ఏదియెట్లున్నను, ప్రస్తుతము మతాచారవిషయమున మనసంఘము చుక్కానులేనిపడవమై పోయినది. ఏమిచేయుదము? దిక్కెవరు?

పైనిజెప్పిన మహానుభావులే దిక్కు. వారుచెప్పినట్లు చేయుటయే దేశపురోభివృద్ధికి మార్గమని నాయభిప్రాయము. అట్టివారిలో నొకఁడే శ్రీవివేకానందస్వామి యని నేననుకొనుచున్నాను.

శ్రీస్వామిగారు కలకత్తాలో బలరామదాసుగారియింటిలోనుండఁగా, ఆయనబాల్యస్నేహితుఁడగుప్రియనాథసింహునకును ఆయనకును జపాను అమెరికాదేశములఁగూర్చి విపులమైనప్రసంగము జరిగినది. ఆసందర్భమున శ్రీస్వామిగారు జాతినిగూర్చి కొంచెము చెప్పినారు. ఆప్రసంగ మీక్రిందఁదెలుఁగులో వ్రాసినాను. దానిఁబట్టి జాతివిషయమై వారియభిప్రాయమేమో స్పష్టముకాఁగలదు. ఆధ్యాత్మికాంశములందువారే యీకాలమునకుఁ దగినయాచార్యులు కానిచో మఱెవరగుదురో నాకుఁ దెలియదు.

"శ్రీవివేకానందస్వామివారిగ్రంథములు—సంభాషణములు" 5. వ సంపుటము—X —292 వపొరట.

ప్రియనాథసింహుఁడు—సరేకాని, పశ్చిమదేశమందు మీకు శిష్యులెందఱున్నారు?

వివేకానందస్వామి—పెక్కురు.

పి—రెండుమూఁడువేలమంది యుందురా!

వి—అంతకంటె అధికముగానే యుండవచ్చును.

పి—వారందఱకు మీరు మంత్రోపదేశము చేసితిరా?

వి—ఆ.

ప్రి—ప్రణవోచ్చారణము చేయుటకు మీరు వారి కనుజ్ఞ యిచ్చితిరా?

వి—ఆ.

పి—మహారాజా! అట్లెట్లుచేసినారు? శూద్రులకు ప్రణవోచ్చారణాధికారము లేదఁటకాదా! ద్విజులుదక్క మరియొకరది యుచ్చరింపఁగూడదఁట కాదా?

అదియుఁగాక, పాశ్చాత్యులు మ్లేచ్ఛులే! శూద్రుల్తైనను గారే!

వి—నే నుపదేశించినవారు బ్రాహ్మణులు గారని నీ కెట్లు తెలియును?

పి—హిందూదేశమున కావల, యవనమ్లేచ్ఛభూములలో మీకు బ్రాహ్మణు లెట్లుదొరకుదురు?

వి—నాశిష్యులందఱు బ్రాహ్మణులే! బ్రాహ్మణులుదక్క పరులు ప్రణవాధికారులు గారని నీవన్నమాట సత్యమే! కాని బ్రాహ్మణునికొడు కెల్లప్పుడును అవశ్యము బ్రాహ్మణుఁడే కానక్కఱలేదు. (వంశపారంపర్యబలముచేత) అట్లగుట కవకాశమున్నప్పటికిని, కాకపోవచ్చును. బాగ్బజారులోని అఘోరచక్రవర్తి మేనల్లుఁడు వీథులూడ్చువాఁడై, కేవలము స్వీకృతజాతిసంబంధముల్తైన నీచకృత్యములు చేయుచున్నట్లు నీవు వినలేదా? అతఁడు బ్రాహ్మణపుత్రుఁడుకాఁడా? బ్రాహ్మణజన్మము వేఱు, బ్రాహ్మణగుణములు వేఱు. మనదేశములో జాతిమా

త్రమునసే మనుజుఁడు విప్రుఁడనిపించుకొనుచున్నాఁడు. కాని పాశ్చాత్య దేశములో బ్రాహ్మణుఁ డనిపించుకొనుటకు బ్రాహ్మణ్యలక్షణము లుండవలెను. గుణములలో సత్త్వరజస్తమోభేదము లున్నట్లే, మనుజుఁడు గుణములఁబట్టి బ్రాహ్మణుఁడో క్షత్రియుఁడో వైశ్యుఁడో శూద్రుఁడో యగుచున్నాఁడు. మనదేశములో బ్రాహ్మణధర్మములును క్షత్రియధర్మములును నశించుచున్నవి. పశ్చిమదేశవాసులకు క్షాత్రము అలవడినది. దాని పైమెట్టు బ్రాహ్మణ్యము. దాని కర్హులైనవారుకూడ ననేకులున్నారు.

ప్రి—అట్లయినచో, స్వభావముచే సాత్త్వికులైనవారిని మీరు బ్రాహ్మణులందురు కాఁబోలు.

వి—ఆ! అలాగే. ప్రతివానిలోను, కొలఁదిగనో గొప్పగనో సత్త్వరజస్తమోగుణములు మూఁడును ఉండును.

అనఁగా—బ్రాహ్మణత్వ క్షత్రియత్వ వైశ్యత్వ శూద్రత్వలక్షణములు—అంతో యింతో—ఎల్లవారిలోను సహజముగా నుండును. కాని పురుషునిలో ఒక్కొక్కతఱిని అందేదో యొకగుణము తక్కినవానికంటె అల్పముగానో అధికముగానో ప్రబలమై ప్రధానముగాఁ జూపట్టును. వివిధవ్యాపారములు చేయువాని నొకనిని ఉదాహరణముగాఁ దీసికొందము. జీతముపుచ్చుకొని యొకరిక్రింద సేవచేయుచున్నప్పు డతనిగుణము శూద్రగుణము. స్వలాభాపేక్షతో నేదోయొకవ్యాపారము చేసికొనుచున్నప్పు డతఁడు వైశ్యుఁడు. అన్యాయము లడఁచుటకై పోరాడునప్పు డతఁడు క్షత్రధర్మము లగపఱచును. భగవద్ధ్యానమో తద్గోష్ఠియో చేయుచు కాలక్షేపముచేయుచున్నప్పు డతఁడు బ్రాహ్మణుఁడు. స్వభావసిద్ధముగా, ఒక్కమనుజుఁడే, ఒకజాతినుండి మఱియొక జాతికి మాఱుటకుఁ గావలసినంత వీలున్నది. అట్లులేనిచో విశ్వామి

తుడు విప్రుడెట్లైనాడు? పరశురాముడు బాహుజుడెట్లయ్యెను?

పి—మీరు సెలవిచ్చినది మిక్కిలి న్యాయముగా గనబడుచున్నది. కాని మనపండితులును కులగురువులును ఆప్రకారము మాకు బోధింపరేమి?

వి—అదియే మనదేశములోని మహానర్థములలో నొకటి. కాని ఇంకామాట యిప్పుడెత్తకుము.

(అని యీసందర్భమున స్వామిగారు పాశ్చాత్యులకార్యశూరతయు అనుష్ఠానాభినివేశమును బ్రశంసించి, మతవిషయమునఁ బనిచేయునప్పుడు సైత మట్టిసాహసోత్సాహములే వారగపడుతురని సెలవిచ్చిరి.)

ప్రి—నిజమే మహారాజా! ఆముష్మికసాధనములు చేయునప్పుడు అతిశీఘ్రముగా వారిమనసు పరిపక్వమై అంతశ్శక్తు లతిశయించి కాన్పించునని నేను విన్నాను. మొన్నమొన్ననే శారదానందస్వామివారు నాకొకయుత్తరము కనఁబఱిచినారు. అది ఆయన పాశ్చాత్యశిష్యులలో నొకరు వ్రాసినారు. ఆలేఖకుఁడు సాధనానుష్ఠానము నాలుగునెలలుమాత్రమే చేసెనఁట. అతని యాత్మతేజశ్శక్తు లెంతో వికసించి విజృంభించెనఁట. అందాశక్తులన్నియు వివరముగా విశదీకరించినాఁడు.

వి—చూచినావా మఱి? పశ్చిమదేశములలో బ్రాహ్మణులున్నారో లేరో యిప్పుడు నీకుఁ దెలిసినదిగద! ఇక్కడఁగూడ బ్రాహ్మణులున్నారు. కాని, క్రూరప్రవర్తనులై దేశము నధోగతిపాలు చేసి దాదాపుగా వినాశస్థితికిఁ దెచ్చుచున్నారు. కావుననే, జన్మముచేత వారికి సహజముగా సంప్రాప్తమైన సద్గుణములు క్రమక్రమముగా అంతరించుచున్నవి. గురువు శిష్యునకు మంత్రోపదేశము చేయుచున్నాఁడు, కాని అది వాని కిప్పుడొక జీవనాధారమైనవృత్తియైనది. అదిగాక,

ప్రస్తుతకాలమందు శిష్యాచార్యసంబంధ మెంత చిత్రముగానున్నదో చూడు! గురువుగారిగృహమున కూడులేదు కాఁబోలు పాపము! ఆసంగతి భార్య జ్ఞప్తికిఁదెచ్చి:—"ఇంకొకమాఱు శిష్యసంచారముచేయరా? ఉదయాద్యాసాయము చీట్లాడి (మూలములో పాచికలనియున్నది) మాయాఁకటిబాధ మాన్పుదురా యేమి?" అని సడుగులాడును. దానికి:—"సరే! మంచిది. రేపుదయమున ఈసంగతి మఱల జ్ఞప్తికిఁదెమ్ము. అల్లాశిష్యుఁడదృష్టవంతుఁడై యెంతో యర్థము సంపాదించుచున్నాఁడు. అతనిఁజూచికూడ చాలఁగాలమైనది." అనిగురువు పత్నికిఁ బ్రత్యుత్తరమిచ్చును. వంగదేశములో కులగురుపద్ధతివాలకమీస్థితికి వచ్చినది. పశ్చిమదేశములలో మతాచార్యవృత్తి యింకను ఇంతహీనస్థితికి రాలేదు. మొత్తముమీఁద అది యిక్కడిస్థితికంటె మంచిది.



# శ్రీవివేకానందస్వామి ప్రశంస.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
(భగవద్గీత.)

ఉదారకరుణాచిత్తు లగుమాప్రభువుగారు భగవత్ప్రేరణమున నాకు విశ్రాంతిసుఖ మిచ్చుచున్నారు. వ్యాధి వెనుదీయుచున్నట్లగపడు చున్నది. మునుపటివలె విశేష శిరోభ్రమణబాధలు లేకుండ, అప్పుడప్పుడు వార్తాపత్రికలు మున్నగునవి చదువుకొనుచున్నాను. ఇట్లుండఁగా నొకనాఁడు "ఓయీ వెఱ్ఱివాఁడా! నీపుణ్యముచేఁ జివరకు సత్ప్రభువుప్రాపు దొరకినది. అదృష్టవంతుఁడవు. జవసత్వము లుడిగినయవస్థలో నిన్నాయన కంటెని ఱెప్పవలెఁ గాచుచు, నీకుఁ గావలయు నైహికసుఖములు పూర్ణముగా నిచ్చుచున్నారుగదా. నిద్రనుండిలేచి యేదో గొణఁగుకొనుచున్నావు. సరే. ఒకయఱగంటసేపుకాఁబోలు తావళము త్రిప్పుకొనుచున్నావు. అదియుసరే—కాని, నిత్యము ఈ "మత్కృత్య కరణేలేమి? ఈ వార్తాపత్రికాపఠనవ్యసనములేమి? భాషాభివృద్ధిచేసికొని యింకను బాఠములు చెప్పి బాలుర నుద్ధరించెదవా? లోకజ్ఞానము దిట్టపఱుచుకొని దేశపరిపాలనములోని లోటులను సవరించెదవా? వేదికపై కెక్కి యుపన్యాసగర్జనములు చేసి యుద్యోగములు సంపాదించెదవా? యూళ్లేలెదవా? యశస్సుకై దేవులాడుచున్నావా? ప్రజలు నిన్నటివఱకు నెత్తిమీఁదఁబెట్టుకొని నేఁడువషట్కారములతో సాగనంపు వారిని జూచుటలేదా? ఖ్యాతియుఁ గాంతాకనకములవంటిదే యని

యనుకొనలేవా? అదిగాక, నీవేమి లోకమాన్యబాలగంగాధరుఁడవా? గంధిమహాత్ముఁడవా? నీబుద్ధియెంత? నీశక్తియెంత? భుక్తశేషమైన నీబ్రతుకెంత? చాలు! చాలు! జబ్బు జాఱుచున్నదని, జబ్బునాఁటి యాయించుకంత భక్తియింకిపోఁజూచుచున్నావా? ఈసింహావలోకనములు-భల్లూకావలోకనములు—నీకేఁకఁ బనికిరావు. వెనుకచూపు ముందుచూపుగా మార్చుకొనుము. ప్రపంచదృష్టి సాధ్యమైనంతవఱకు తగ్గించుకొని కొంచెము పరమార్థచింతలోఁ బడుము. కొలఁదిగనో గొప్పగనో యితరసుఖము లేఁబదినాలుగేండ్లు చవిచూడనే చూచితివి. రుచిచూడని పరసుఖముకై ప్రాఁకులాడరాదా?" అని యొకయంతర్వాణి పలికినట్లయ్యెను.

సవరించి వదలిన శ్వపుచ్ఛమువలె మెలికలుదిరిగి, మనసు మఱియొకమార్గమును బట్టుచున్నదా యేమి? అని చూచుకొని, తగినగ్రంథమేదైనఁ జదువఁ దలపెట్టుకొంటిని.

"భగవద్గీతా కించిదధీతా" అన్నశ్లోకము జ్ఞప్తికివచ్చినది. జ్ఞప్తికివచ్చినఁ గార్యమేమి? సంస్కృతము రాదు. వల్లించుకొనరాదా? ధారణాశక్తి తరలిపోయినది. నిత్యపారాయణము చేసికొనుచు నిర్వాణానంద మొందరాదా? శుష్కగీతాపారాయణము శుకప్రలాపప్రాయమని, విదేశవిద్యావిసందిగ్ధచిత్తము వెనువెనుకకుఁ బోయినది. కనుక సత్యోత్తమమైన భగవద్గీత యందరాని పండయిపోయినది.

ఇఁక వేదవేదాంతములు—గీతలు—భాష్యములు—యోగశాస్త్రములు—యావదన్యమతగ్రంథములు—చూచి తెలిసికొని, తెలిసికొన్నవి తీవ్రముముక్షువై యాచరణములోఁ బెట్టి పరీక్షించి చూచుకొని, ముక్తుఁడై, ముక్తిసాధనములు పరోపకారార్థము విస్పష్టముగా—నాంధ్రములోఁగాని, యాంగ్లములోఁగాని, వ్రాసిన మహానుభావు లెవ

రైన నున్నారా? యని పర్యాలోచనము చేసితిని. అప్పుడు వివేకానందస్వామినామము, విద్యుల్లతవలె హృదయాకాశమునం దు మెఱసెను.

ఈయన శ్రీరామకృష్ణపరమహంసగురువర్యుని ప్రియశిష్యుఁడు, జ్ఞానపుత్త్రుఁడు. ఆంగ్లసంస్కృతవిద్యాప్రవీణుఁడు. ఆడుకొను వయసునందే యత్యద్భుత భక్తిజ్ఞానవైరాగ్యచిహ్నము లగపడిన వాఁడు. మహావక్త. గురువుగారివలెనే, కామినీకాంచనములను బూర్తిగా జయించినవాఁడు. తాను అమెరికాలో నున్నప్పుడు తద్దేశపు మహాధనికురాలొకయామె, దగ్గఱకువచ్చి "స్వామీ! నాసర్వస్వముతో మీకీశరీర మర్పించుకొనుచున్నాను. మీభార్యగాఁ గైకొని నన్ను ధన్యురాలిని జేయుఁ" డని పలికినప్పుడు నిశ్చలబ్రహ్మచర్యతేజముఁ గ్రక్కు చూపులతో నామెను జూచి, అమ్మా! నేను సన్న్యాసిని. నాకు ధనముతోఁ బనిలేదు. ప్రపంచములోని స్త్రీలందఱు నాకుఁ దల్లులు. నీవొకతల్లివి అని ప్రత్యుత్తరమిచ్చిన కలియుగ శుకయోగీంద్రుఁడు.

మెడఁబట్టుకొని వంచి చక్కని ముత్యములు దీసికొమ్మని, యెవరైన సముద్రములోఁ దలముంచినప్పుడు, ఉక్కిరిబిక్కిరియై "ఊపిరాడుట లేదు. చచ్చిపోవుచున్నాను. నీముత్యములు నా కక్కఱలేదు. బాబూ! మెడవదలి రక్షింపు" మని మనుష్యుఁ డెంతయాతురతతోఁ బ్రార్థించునో, యంత యాతురతతో భవబాధావిముక్తికై భగవంతుని బ్రార్థించిన భక్తసత్తముఁడు.

చిన్ననాఁడే తీవ్రోద్రేకముతో, మహర్షి దేవేంద్రనాథటాగూరు గారియొద్దకుఁ బిచ్చిపట్టినవానివలెఁ బరుగెత్తుకొనిపోయి "మహాత్మా! మీరు దేవునిఁ జూచినారా?" యని యడిగి యులబ్ధకాముఁడై, శ్రీరామకృష్ణపరమహంసునికడ కేతెంచి, యట్లే ప్రశ్నించి, చివరకుఁ

కృతార్థుఁడైన తీవ్రవైరాగ్యసంపన్నుఁడు. చదువుకొనురోజులలో,ఒక యాంగ్లేయమతబోధకుఁడు రోడ్డుమీఁద విగ్రహారాధనమును దూషించుచు—"నాకఱ్ఱతోఁగొట్టిన, మీవిగ్రహ మేమిచేయఁగలదు?" అనఁగా "పడఁదిట్టినచో, మీప్రభు వేమిచేయఁగలఁడు?" అన్నశూరుఁడు. "నీవు చచ్చినతరువాత నరకములోఁ బడవేయును" అని కోపించి అతఁడు పలుకఁగా, "మావిగ్రహము, నీవుచచ్చినతరువాత నిన్ను నరకజ్వాలలలోఁ బడవేసి మలమలమాడుచును" అని ప్రత్యుత్తరమిచ్చిన మేరుధైర్యుఁడు.

సద్గురుచరణారవిందసేవచే, సమస్తయోగరహస్యములు, సమస్తధ్యానరహస్యములు, అనుభవపూర్వకముగా గ్రహించిన పుణ్యపురుషుఁడు. గురుశుశ్రూష చేయుకాలములో, గురూపదేశప్రకారము, సమాధినిష్ఠుఁడై, తోడిశిష్యుఁడు దోమకాటునకు వెఱచి తొలఁగిపోఁగా, గొంగళిగప్పినట్లు దోమలు దట్టముగ మూఁగి దేహమంతయుఁ గఱచినను, కదలక మెదలక, అట్లేయున్న యేకాగ్రచిత్తుఁడు.

ఆసేతుహిమాచలపర్యంతము తిరిగి, నానాక్షేత్రములు—నానాతీర్థములు—వివిధదేవాలయములు—సేవించి, ధ్యానపరిపాకముచే వివిధధ్యానానుభవఫలముల నాస్వాదించిన భక్తశిరోమణి.

బౌద్ధ, జైన, క్రైస్తవ తురుష్కాది వివిధమతసారములఁ జక్కఁగాఁ గ్రోలినసమచిత్తుఁడు. తత్తన్మతగురువులను విరాగులను దర్శించి,చర్చించి, చెప్పి, నేర్చి, సర్వమతసామరస్యమును గనిపట్టినమహోదారుఁడు.

గురుకటాక్షముచేఁ బరమావధియగు నిర్వికల్ప సమాధి సుఖము గూడఁ జవిచూచిన ధన్యాత్ముఁడు. ఆర్షమత సనాతనధర్మముల ప్రాశస్త్యమును స్వానుభవమునఁ గనుఁగొన్న సన్న్యాసిసత్తముఁడు. మహాదేశాభిమాని. నిమ్నజాతుల దురవస్థను జూచి వెక్కుపాష్ప కన్నీరు

విడిచిన కరుణామయుఁడు. మ్లేచ్ఛశబ్ద మెప్పుడు కల్పించినారో అప్పుడే యార్షమతము నడఁగఁద్రొక్కినారన్న కుశాగ్రబుద్ధి. సత్యగ్రహణ చతురుఁడు.

మూలగ్రంథములను అభిమానభాష్యకర్తల దృష్టితోనే చూచుచు భగవద్దత్తమైన స్వబుద్ధి నుపయోగపఱుపక, దేశకాలస్థితిభేదములఁ బాటింపక, కేవల ప్రాచీనత్వమే సార్వకాలికప్రమాణముగా గ్రహించుచు, ఆచారమే యామ్నాయమనియనుకొనుచు, అన్యాయ్యములును ఐకమత్యభంజకములును దేశానర్థదాయకములును, అగు పరంపరాగతములైన కొన్ని అసమంజసాచారములను అభినివేశముతోఁ బ్రవర్తింపఁజేయువారి బాధయొకటి. ఆంగ్లవిద్యావ్యాసంగముచే నన్నపానపరిచారములు మార్చుకొని పరదేశీయులయొక్క పై మిసమిసలకు భ్రమసి, విదేశవేషభాషాహార విహార వ్యామోహితులై, మసిపాఁతలోఁ గట్టి దాఁచిన మాణిక్యములవలెనున్న సనాతనధర్మరహస్యములను గనుఁగొనక, కనుఁగొనలేక, క్రొత్తమతములు సృష్టించి ఉన్నకాసంతయైకమత్యమును దేశమతాభిమానములతోఁగూడ గంగలోఁ గలుపుటకుఁ గ్రొత్తమార్గములు కల్పించినవారి బాధయొకటి. ఈయంతర్బాహ్యశత్రుబాధాద్వయమధ్యమునఁ జిక్కి సనాతనమతము శల్యమాత్రావశిష్టమై యున్నదని పరిపరివిధములఁ బరితపించిన పరివ్రాజకచక్రవర్తి.

"వీఁడు సర్వప్రపంచము నొకయూఁపూఁపి, గజగజలాడించును" అని తనగురుమౌళి భావిసూచకముగాఁ బల్కుట కర్హుఁడై పుట్టినవాఁడు. అమెరికా యూరప్పులలో అక్లేనిష్కళంకప్రవర్తనముతో,నిరుపమాన వక్తృత్వముతో, నిష్పక్షపాత యుక్తివాదములతో, అసాధారణ మేధాసంపత్తితో, అనన్యసామాన్యవైదుషీమహిమతో, ఆర్షమతబోధనము గావించి అనేక ప్రసిద్ధస్త్రీపురుషులను శిష్యురాండ్రఁగాను శిష్యు

లుఁగాను జేసికొని వైదికమతోత్కృష్టతను స్థాపించి అన్యదేశములలో ఆర్షమతబోధాశ్రమముల నెలకొల్పిన మహాప్రతిభాశాలి.

ఇట్టి శ్రీవివేకానందస్వామి అపరశంకరాచార్యుఁడు కాఁడా? పుంరూప సరస్వతి కాఁడా? మన దేశమాతపుత్రరత్నము కాఁడా? ఆర్యావర్త మహాతపఃఫలము కాఁడా? ఔననియే; నేననుకొనుచున్నాను. పెక్కు రట్లే తలంచుచున్నారు.

ఆత్మవిద్యావిషయకమైన సంశయములు నివృత్తి చేసికొనుటకై, బ్రహ్మసాక్షాత్కారముకై, శ్రీవివేకానందస్వామి పడినపాట్లెన్నెన్ని కావు. ఎన్నితపస్యలు! ఎన్ని యోగసాధనములు! ఎంతకాలము చేసినాఁడు, పాపము! గురుదేవుని ఛాయాప్రతిమ, భగవద్గీత, దండకమండలువులు, భిక్షాపాత్ర, కాషాయచేలము—ఇవితప్ప మఱియొండు లేకుండ, నెన్నియడవులు గుహాలు చొచ్చినాఁడు! ఎన్నితీర్థములలోఁ గ్రుంకినాఁడు! ఎందఱు సిద్ధపురుషులను సేవించినాఁడు! కొంకుజంకులు లేకుండ నెన్నిప్రశ్నలు వారికి వేసి, వారుచెప్పినట్లు చేసి, సందేహపరంపరలు దీర్చుకొన్నాఁడు! అన్నపానములులేక యెప్పుడప్పు డెన్నిరోజులు పర్వతారణ్యములలోఁ బర్యటనముచేసినాఁడు! సర్వసామాన్యమైన భుక్తికే యెంతో శ్రమపడవలెనుగదా! ముక్తికై యెంతశ్రమ పడవలయునో ముక్తపురుషులే చెప్పవలెనుగాని యితరులెట్లు చెప్పఁగలరు? ఆత్మజిజ్ఞాసునకు, అభీష్టసిద్ధికిఁ బూర్వము, అనేకబాధలు పడుట తప్పదు.

దివ్యమోక్షానందముకై యెంతకష్టముపడినాఁడో, దేశమతోద్ధరణముకై యంతకష్టము పడినాఁడు. అందుకై తనశక్తి, తనబుద్ధి, గురుకటాక్షసమార్జితమైన తన యమూల్యతత్వజ్ఞానధనము, తనప్రాణము, ధారవోసినాఁడు.

అనేక మహారాజులు శిష్యులై ధనము లర్పించుకొనుచున్నను,

వలదు వలదని వదలిపెట్టినాఁడు. మూఁడునాళ్లకంటె ఎక్కువేగా సన్న్యా సి యొకపట్టణమున నుండఁగూడదని, పామునుజూచి పాఱిపోవు బాల కునివలె, పెక్కుసార్లు తనకు సేవచేయుచుండు ధనికశిష్యులనుండి తర లిపోయినాఁడు. ఇది అమెరికాకు వెళ్లకపూర్వము స్వామి మనదేశము లోఁ బరివ్రాజకవృత్తిలో నున్నప్పటిమాట.

గురువునొద్ద సాధనములు చేయుచున్నప్పు డనేకయోగమహిమ లువడసియు, నవి మోక్షావరోధకములని త్యాఁ ద్యజించుటయేగాక, నా యట్లే ఖారును జేయుఁడని తనశిష్యులకుఁ బెక్కుసార్లు నొక్కినొక్కి బోధించినవాఁడు.

మైసూరుమహారాజుగా రొకనాఁడు మిక్కిలి గౌరవించి తనప్రక్క నుచితాసనముపైఁ గూరుచుండఁబెట్టుకొని, చనవుతో "స్వామీ! మాయాస్థానములోని దివాను, సన్నిధానవర్తులును, ఎట్టివారు?" అని వారియెదుటనే యడుగఁగా, "అన్నిసంస్థానములలోను నెట్లున్నారో, యిచటను అట్లేయున్నారు." అని జంకులేక పలికినాఁడు. అంత, మహారాజు యతనను లోపలికిఁ దీసికొనిపోయి "మహాత్మా! గొప్పవారని వారిమాట మించుకయులేక, సమ్ముఖముననే, వారి నట్లు పరాభవించితిరే!" యని పలుకఁగా, "మహారాజా! నీవు నన్నడిగితివి గాన, బ్రత్యుత్తర మీయవలసివచ్చెను. సన్న్యసించినతరువాత నైనను సత్యమాడవల దా? నిన్నుఁగూర్చి నీకుమారుఁ డడిగినను, ఉన్నదున్నట్లు చెప్పువాఁడ నే!" యని నిర్భీకుఁడై జవాబిచ్చెను.

ఒకనాఁ డీయనయును, ఇద్దఱు గొప్పయాంగ్లేయులును, ఒకబండిలోనే కూరుచుండి రెయిలుప్రయాణము చేయవలసివచ్చెను. స్వామి కింగ్లీషుభాష రాదనుకొని సాధువులు దొంగలని, వంచకులని, సోమరిపోతులని, త్రిమ్మరులని, ఆయిరువురు నోటికివచ్చినట్లు వారిభాషతోదూ

క్షించుచుండిరి. స్వామి నిశ్చలచిత్తుఁడై నిమీలితనయనుఁడై యూరకుండెను. అంతట నొక స్టేషనుకడ ఈముగ్గురును దిగిరి. దాహమగుచున్నది, కొంచెము మంచితీర్థమిప్పించెదరా? యని స్టేషన్మాస్టరుగారిని స్వామి యింగ్లిషుభాషలో నడిగెను. అది విని దొరలాశ్చర్యపడి యాడినమాటలకు నొచ్చుకొని, "ఏమయ్యా! యింగ్లీషువచ్చికూడ, మేమన్నిమాటలు మిమ్మన్నప్పుడు మిన్నకుంటిరి?" అని యాంగ్లేయభాషతో సాంత్వనవచనము లాడిరి. "మూఢులను జూచుటకు, మూఢప్రసంగములు వినుటకు, నాకిది మొదటిమాటుగాదు" అని స్వామి యింగ్లీషుతోనే జవాబిచ్చెను. దొరలకుఁ గోపమువచ్చి కన్నులెఱ్ఱఁబడెను. అట్టివానికి నేను సంసిద్ధుఁడనైయే యున్నానని చెప్పినట్లు స్వామి రొమ్ము పెంచి, యినుపముద్దలవలె నున్న చేతికండలను వారిదృష్టిపథమునఁ బఱపెను. ఇంక మర్యాద దక్కదనికాఁబోలు క్షమింపుమని పల్కి మఱి మాటాడక దొరగార్లు వారిదారిని వారు తొలఁగిపోయిరి.

"శివోఽహ" మ్మను వాక్య మనుభవమునకుఁ దెచ్చుకొనఁగోరి జీవేశ్వరైక్యానుసంధానమునకై చేయుప్రయత్నములలోఁ బైమెట్టు పట్టుపడనప్పుడును, అమోఘమైన దేశోద్ధరణసాధనము మనస్సునకుఁ దట్టనప్పుడును, స్వామి గిజగిజ కొట్టుకొని—"ఓ శ్రీరామకృష్ణభగవానుఁడా! ఓతల్లీ! జగజ్జననీ! మీబిడ్డనికి సరియైనదారి చూపి కృతకృత్యుని జేయరా? మీయాదేశమునేకదా శిరసావహించి నెఱవేర్పఁ ద్రికరణశుద్ధిగా దీక్షవహించితిని. కరుణించి రక్షింపుఁడు. మీయనంతతేజశ్శక్తులు నాకుఁ బ్రసాదింపుఁడు!" అని భక్తిబాష్పములు వఱదలువాఱ, శ్రీ కన్యాకుమారి యాలయము మున్నగు పవిత్రస్థానములలో, నెన్నోసార్లఱచినాఁడు. అఱచియఱచి తుదకుఁ దనయభీష్టసిద్ధికిఁ గావలసిన జ్ఞానతేజోబలమును బూర్ణముగా సంపాదించుకొన్నాఁడు.

సంపాదించుకొని సత్సంకల్పములు నెఱవేర్చుకొని శాశ్వతకీర్తిఁ బడసి
నాఁడు.

ఇట్టి మహామహునిచరిత్ర చదువు మహాభాగ్యము నాకుఁ గలిగి
నది. హిమవత్ప్రాంతమందలి మాయావతిలోని యద్వైతాశ్రమమున,
శ్రీస్వామి ప్రాక్పశ్చిమశిష్యులు, గురుసచ్చరిత్రమును, భక్తిభరితాం
తరంగులై, ఇంగ్లీషుభాషలో విపులముగా, చక్కఁగా, అమృతోపమా
నమైనశైలితో వ్రాసి 4 సంపుటములుగా కలకత్తాలో ముద్రింపించి
ప్రకటించి పుణ్యముగట్టుకొన్నారు. అందుఁ బ్రథమద్వితీయసంపుటము
లు పరమానందముతోఁ బఠించినాను. మిగిలినభాగములు చదువుటకు
మహోత్కంఠతో నున్నాను.

శ్రీమద్భగవద్గీతాగ్రంథమునుండి యెత్తి 'మకుటము' గా వ్రా
సినశ్లోకము, ఈనాఁటి యనన్యభక్తుల పూతచరితములందుఁగూడఁ బూ
ర్ణముగా సత్యమౌచున్నదని చూపుటయే, యీవ్యాసముయొక్క ము
ఖ్యోద్దేశము. అందుకై శ్రీవివేకానందస్వామి జీవితమునుండి రెండు
దాహరణము లీక్రింద నిచ్చెదను. ఆమహానుభావునెడల నాకుఁగలభక్తి
ప్రపత్తులు వెల్లడించుటకును, ఆయన పవిత్రచరణారవిందములకు నా
శతసహస్రప్రణామము లంతశ్శుద్ధిగా నర్పించుటకును, ఉపోద్ఘాత మిం
త పెంపవలసివచ్చెను. శ్రమయిచ్చినందులకుఁ బఠితలు నన్ను మ
న్నింతురుగాక!

ఊరూరఁ దిరిగి, యింటింట బిచ్చమెత్తుకొనురోజులలో, ఒక
నాఁడు—"నేనిల్లువదలి సన్యసించినది ఆత్మసాక్షాత్కారమునకా?
అడుగుకొని తినుటకా? అది నాకు సిద్ధింపనప్పుడు భిక్షాటనమేల? నిజ
పేదల బాధించి నేఁదినినందువలనఫలమేమి? పిడికెఁడుబియ్యము మిగిలి
నఁ బేదవారి బిడ్డకొకముద్ద దక్కునదన్నమాటగదా! పరమాత్మావలో

కటిమునకుఁ బనికిరాని యీపాడుశరీరమును నే నేలకాపాడుకోవలెను? ఛీ! ఛీ! ఇఁక నీవృత్తి మానెదను. పూర్వముముక్షువులవలెనే నేను బోధెదను. అన్నముతినక, నీళ్లుత్రాగక, ప్రయాణపరిశ్రమలచే ఈ రక్తమాంసాస్థివసామయమైన దేహమును శుష్కింపఁజేసి దారిలో నెచటనో వ్రాల్చెదను.—'' అని వివేకానందస్వామి తలఁచుకొని, దృఢనిశ్చయుఁడై, యొకమహారణ్యములోఁ జొరఁబడి, నీరాహారములు వర్జించి, పగలంతయు నడచి, శ్రమచే నింకఁ గాలుసాగింపలేక, సాయంసంధ్యాసమయమున నొకచెట్టుక్రిందఁ జతికిలఁబడెను. చదికిలఁబడి, సర్వాంతర్యామియగు భగవంతునిపై మనసుపెట్టుకొని, తదేకదృష్టితోఁ జూచుచుండెను.

ఇట్లుండఁగాఁ గొంతసేపటికొక పెద్దపులి దూరమునఁ గనఁబడెను. క్రమక్రమముగా దగ్గఱదగ్గఱకు వచ్చి, అది కొన్నిగజములదూరమున ఆఁగి అచటఁ గూర్చుండెను.

స్వామి యాశ్చర్యపడి, "సరే! బాగుగనే యున్నది. మనమిద్దఱముకూడ మిక్కిలి యాఁకలిగొనియున్నాము. ఈశ్వరసాక్షాత్కారమున కుపయోగింపని యీతనువువలనఁ బ్రపంచమున కేమియులాభములేదు. ఇట్టిదానితో నాకుమాత్ర మేమిపని? క్షుద్బాధచే నకనకఁబడియున్న నీ కుక్షిగహ్వరములోఁ బడినచో దీనిజన్మము కొంతసార్థకమగునేమో!" అని తలపోసికొని, పులి యేనిమిషముననో తనమీఁదఁబడి, తన్నుఁ దినునని నిశ్చయించుకొని, నిశ్చలుఁడై, నిర్భయచిత్తుఁడై, యెవరిపై నింతవఱకు మనసుఁబెట్టుకొనెనో, ఆయనపైనే దానిని గట్టిగా లగ్నముచేసి, నిర్యాణక్షణమును నిరీక్షించుచుండెను.

కాని, కూరుచుండికూరుచుండి యేకారణముననో, పులి చటుక్కునలేచి మఱియొకత్రోవను బట్టి పోయెను. పోయినప్పటికిని, అది మఱల వచ్చి

తన్నుఁ గబళించుట తప్పదనుకొని, స్వామి ప్రతినిమిషమును దానికై వేచికొనియుండెను. ఎంత సేపు కనుపెట్టుకొనియున్నను, అది వచ్చి తిరుగఁ గనఁబడలేదు. అతఁడు రాత్రియంతయు ఆచెట్టుక్రిందనే పరుండి నిదురపోయెను. తెల్లవాఱెను. అపూర్వమైన శరీరబలముతోను, అత్యంతమైన మనోబలముతోను స్వామి నిద్రలేచి తరలిపోయెను. ఆఁకటి చేతను, దప్పిచేతను, కాలినడకచేతను ఎంతో బడలి సోలి చదికిలఁబడిన సన్న్యాసికి, అట్టి దేహబల మనోబలము లెట్టువచ్చెనో, ఎవరిచ్చిరో, వివేకానందస్వామి కెఱుక! స్వాములకెల్లరకును స్వామియగు ఆస్వామి కెఱుక!

మండువేసఁగి. స్వామి పరివ్రాజకవ్రతముపూని తిరుగుచుండెను. తిరుగుచున్నది అత్యుష్ణమైన దేశము. రాజపుత్రస్థానము. ఎడారిభూమి. మధ్యాహ్నకాలమున ఇసుకరేణువులు తళతళ మెఱయుచు గాజుపూసల వలెఁ గన్నులు మిఱుమిట్లుగొల్పుచుండును. బయళ్లు ఆవిరిగ్రమ్మినట్లగ పడును. బొంగరములవలెఁ జిన్నచిన్న సుడిగాలులు ఆత్మప్రదక్షిణములు చేయుచుండును. వేఁడిమి కలవాటుపడి చిట్టితుప్పలలో మేయుచుండు మేఁకలుగూడ నొకప్పుడు కానరాకుండును.

ఇట్టికాలములో వివేకానందపరివ్రాజకుఁడు పర్యటనము చేయుచుండెను. కావియంగీ, కావిశాటి, తప్ప దగ్గఱ మఱియేవిధమైనఆస్తియు లేదు. సాధారణముగా కఱ్ఱతోనో, కొబ్బెరపెంకుతోనో చేసిన కమండలువొకటి చేత నుంచుకొనెడువాఁడు. అదికూడ ఎక్కడఁ బాఱవేసినాఁడో కాని, యిప్పుడు లేదు.

తిండిలేకుండఁ, గొన్నిపూఁటలనుండి యొకవస్త్రమునితో రెయిలు బండిలోఁ బ్రయాణముచేయుచుండెను. స్టేషనుస్టేషనునొద్దను, మంచినీళ్ళవానిని మంచినీళ్లడిగెను గాని, చేతిలో నేమిఖరీదు పెట్టకపోవుట

చేత, వాఁడు మాటవినిపించుకొనకయే, మఱియొక చోటికిఁ బోవుచుండె ను. వాఁడు మఱల వచ్చుసరికి, రెయిలుకూసి స్టేషనునుండి పోవుచుం డెను. ఇట్టిదుస్థితిలో స్వామి దాహశాంతి గావించుకొనుట. కవకాశ ములేకపోయెను. జిహ్వ ఆఱిపోవుచుండెను.

సహపథికుఁడైనవర్తకునకు, సన్యాసులన్నను, సాధువులన్నను, పరమాసహ్యము. డబ్బుగలవాఁడగుటచేతఁ గావలసినపండ్లు, భక్ష్యము లు, పాలు, చల్లనిమంచినీళ్లు, కొని ఆరగించుచుండెను. ఆరగించుటలో నేమియుఁ దప్పులేదుగాని, అతఁడు స్వామినిజూచి నవ్వుచు, వెక్కిరించు చు, మర్మభేదనములగు మాటలాడుచు, మిక్కిలి బాధపెట్టుచుండెను. ఇది కడుశోచనీయము.

చివర కిద్దఱును "తారిఘాట్టు" అనుస్టేషనులో, అభిజిత్కాల మ్మున దిగిరి. డబ్బులేని వివేకానందునిమొగ మెవరుచూతురు? మంచి నీళ్లు దొరకినవిగావు సరికదా, తలదాఁచుకొనుటకు స్టేషనులో నీడగల చల్లనిప్రదేశమైనను దొరకలేదు. పైశాటి తడుపుకొని, పదములు మండిపోవ బయటి యిసుకమీఁదఁ బఱచుకొని, యొకస్తంభమునకు వెన్నానుకొని, కూరుచుండెను. ఆయనయెదుటనే కొంచెముదూరమున చల్లనిచోట, మృదులాస్తరణముమీఁద, చుట్టును సమస్తభోగపదార్థ ములు పెట్టుకొని, వర్తకుఁడు నక్షత్రకుఁడువలెఁ గూరుచుండెను.

కూరుచుండి యూరకుండక–"ఏమయ్యా! ఇటుచూడు! ఆహా! ఎంతచల్లనిమంచినీళ్లు! ఎంతరుచిమంతములైన లడ్డుమిఠాయియుండలు! ఈపూరీలు చూడు! ఏమిమృదువైనపూరీలు! ఇవన్నియు నేను ఆప్యా యనముగాఁ దిని దివ్యానందభరితుఁడనౌచున్నానే! నీగ్రహచారమేమి కాలినది? సన్యాసము పుచ్చుకొని యేమిబావుకొనుచున్నావయ్యా? వృద్ధిమగాఁకుబాగుంటివిగదా, ఏదోపనిచేసికొని, డబ్బుసంపాదించుకొని

సుఖపడరాదా? అర్థపరిత్యాగము అనుత్యాగములోనికి దింపదా? ధనహీనుఁడు బుద్ధిహీనుఁడుగాఁడా? చేయి, జేబును వట్టివైనప్పుడు, పొట్టమాత్రము వట్టిదిగానుండదా? విత్తమువలదన్న వెఱ్ఱివెంగలయ్యకీ శాస్తి కావలసినదే, ఇంకను గావలసినదే! చూడు! కూరుచుండుటకు నాకీస్నిగ్ధచిత్రాసనము—నీకు కనకనలాడు కఱకుటిసుకనేల! తినుటకుఁ ద్రాగుటకు నాకు మంచిమంచిభక్ష్యపానీయములు—నీకు మాఁడెడు కడుపు, ఎండెడుగొంతుకయును! తెచ్చిపెట్టుకొన్నకష్టములు తృప్తిగా తీఱికగా అనుభవింపుము." అని పాప! మావర్తకుఁడు స్వామిని ఊరకుండనీక పిలిచి, దెప్పుచు, పెదవులు బిగించిచూచుచు, పకపకనవ్వుచు, లొట్టలువేసి తినుచు, గుటకలువేసి త్రాగుచు, తెగఁద్రేన్చుచుఁ బలువిధముల బాధపెట్టుచుండెను.

శుద్ధసత్వస్వభావుఁడగుస్వామి యాపరిహాసవాక్యములకును, అవజ్ఞాచేష్టితములకును, ఏమాత్రమును గినియక, చలింపక, తితిక్షావిగ్రహమువలెఁ గూరుచుండెను.

అంతలో నాగ్రామనివాసియే యొకఁడు, కుడిచేత నొకమూటయు లోటయును, ఎడమచేత శీతలసుగంధసలిలపూర్ణమైనయొక మట్టికూజాయును పట్టుకొని, కక్షములో నొకతెల్ల చిన్నదుప్పటియును, ఆస్తరణమున కుపయోగించు నొకచిన్నమెత్తయును బెట్టుకొని, పరుగుపరుగున వచ్చి, స్టేషనులోఁ జొచ్చి, శుభ్రమైన యొకచోట దుప్పటిపఱచి, మూటవిప్పి, యందలి వివిధభోజనపదార్థములను దానిపై నమర్చి స్వామికడకు సంభ్రమముతో వగరుచుకొనుచు వచ్చి, "బాబాజీ! దయచేసి యిటువచ్చి, తమకు నేఁదెచ్చినయాహారమును వేగ భుజింపుఁడు." అని ప్రార్థించెను.

అవన్నియు నెట్లుప్రాప్తించెనో, తెచ్చినయాతఁ డెవ్వఁడో, యేను

మాత్రము నెఱుఁగని స్వామి యాశ్చర్యమును, ఇంతవఱకు [illegible]
పరిహాసములు చేయుచు, ఇప్పుడు వెలవెలఁబాఱినముఖముతో, దా
నోటితోఁ, దెఱచినకన్నులు మూయకుండఁ, జూచుచు నిర్జీవప్రతిమవలె
నున్న వర్తకునియాశ్చర్యమును, ఎవఁడు మాటలతో వర్ణింపఁగలఁడు?

క్రొత్తగావచ్చినతఁడు "బాబాజీ! ఆలస్యముచేయకుఁడు! వచ్చి వెంటనే భుజింపకతప్పదు." అని స్వామిని బతిమాలి బలవంతపెట్టుచుండెను.

స్వా—మిత్రమా! నీవేదో పొరపాటు పడుచున్నట్లున్నావు. ఒకనినిజూచి ఒకఁడనుకొనుచున్నావేమో! నిన్నెన్నఁడును జూచినట్లు నాకు జ్ఞప్తిలో లేదు.

గ్రా—సరిసరి! బాబాజీ! నేను మిమ్ముఁజూచితిని, చూచితిని, పొరపాటేమియు లేదు. (వర్తకుఁడు తెల్లనోరువెట్టుకొని చూచుచుండెను. స్వామి యతివిస్మయముతో నిట్లు పలికెను.)

స్వా—అయ్యా! నీమాటలు నాకు దురవగాహములుగానున్నవి. నన్నెక్కడఁ జూచితివి?

గ్రా—బాబాజీ! వినుఁడు. నే నీయూరి మిఠాయివర్తకుఁడను. ప్రొద్దున భోజనముచేసి, మామూలుగా, పక్కపైఁబరుండి కొంచెము కన్నుమూసితిని. అంతట నొకస్వప్నము వచ్చెను. అందు శ్రీరామచంద్రమూర్తి నన్ను—సరిగా నీవంటిరూపమునే—వ్రేలుపెట్టి చూపి "అదిగో! వాఁడు, నీయెదుట నగపడువాఁడు, నిన్నటినుండి తిండిలేక, బాధపడుచున్నాఁడు. ఆబాధయంతయు నేనును బడుచున్నాను. వెంటనే లేచి, పూరీలు కూరలు చేసి యావియును, మిఠాయిలును, చల్లని మంచితీర్థమును, కూరుచుండుట కొక చిన్నమెత్తయును, రెయిలుస్టేషనునకుఁ బట్టుకొని వెళ్లుము. లెమ్ము." అని పలికెను. నేను మేల్కొంటిని

గాని, అదియేదో సామాన్యపుకలయని అలక్ష్యముచేసి, ప్రక్కకు ఒత్తిగిల్లి, మఱలఁ బరుంటిని. అంతట, అపారకృపాసముద్రుఁడగు శ్రీరామచంద్రప్రభువు, తిరుగ నిద్రలో నగపడి—"ఓరీ! ఏమిరా! త్వరగా లేచి నేఁజెప్పినట్లు చేయవేమిరా?" అని నన్నుఁ బొడిచి లేపినట్లయ్యెను. ఇఁక నే నెట్లుపేక్షచేయఁగలను? ఉలికిపడి లేచి, శీఘ్రముగా పూరీలును కూరలును జేసి, అవియును తత్పూర్వమే చేయఁబడి సిద్ధముగానున్న మంచిమిఠాయియును, గుభుగుమలాడు చల్లని మంచితీర్థమును, ఒక చిన్నమెత్తను పట్టుకొని, వేళ మించిపోవునేమోయను భయముతో, తిన్నఁగా ఇచ్చటికి పరుగుపరుగున వచ్చితిని. వచ్చి, స్వప్నములో సాక్షాత్కరించిన రెండవమహానుభావుని—మిమ్ము—దూరమునుండియే చూచి ఆనవాలుపట్టితిని. పొరపాటుమాత్రమునులేదు. కనుక దయచేసి వేఁడి చల్లారకముందే, తెచ్చినవి ఆరగించి నన్ను ధన్యుని జేయుఁడు. మీరు మిక్కిలి క్షుద్బాధతో నున్నారు. ఇఁక నాలస్యము చేయకుఁడు.

(వెంటనే స్వామి వెళ్లి సంతృప్తిగా భుజించి, కడుపునిండఁ జల్లని మంచితీర్థముత్రావి, మిఠాయివర్తకునికిఁ గృతజ్ఞతాభివందనములర్పింపఁబోఁగా,)

గా—అదేమిబాబాజీ! వలదు, వలదు! వందనములునాకా? అంతయు శ్రీరామచంద్రభగవానుని యిచ్ఛప్రకారము, ఆజ్ఞప్రకారము జరిగినది. ఆయనకు సమర్పింపుఁడు.

అన్నిపరిహాసములు చేసి స్వామిని పరాభవించిన వర్తకుఁడు పిడుగుపడినవానివలెఁ గొంతసేపు నిశ్చేష్టితుఁడై యుండి, పిమ్మట స్మృతికివచ్చి, బుద్ధిదెచ్చుకొని, పశ్చాత్తప్తుఁడై, క్షమింపుఁడని స్వామిపాదములపైఁ బడి, పాదరజముతీసి బొట్టుపెట్టుకొనెను.

స్వామి విస్మయానందభరితుండై, విచ్ఛిన్నసంశయుండై, కనుం గవనుండి పూర్ణపూతభక్తిబాష్పములు కాలువలుగా చెక్కులంటి ప్రవహింప, పైనిర్వాసిన భగవద్గీతాశ్లోకరాజమును స్మరించుకొనెను. స్మరించుకొని, "పరమేశ్వరా! మార్జాలకిశోరన్యాయముగా నిన్నే న మ్ముకొన్నవారికి, బాధలన్నియును పటాపంచేలానుగదా!" యని ని శ్చలమనస్కుండై ధ్యానించుకొనియుండును.

10-12-1920.



తప్పొప్పుల పట్టిక.



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 4 | వహాహ్వ | వహావ్వా |
| 29 | 24 | నురుగు | నురుంగు |
| 36 | 23 | వెలగ | వెలంగ |
| 41 | 16 | గ్రింథ | గ్రంథ |
| 63 | 16 | గందర్ | గందల్ |
| 65 | 2 | కాళీయుండిన | కాళీమైన |
| 71 | 11 | జాగ్రిత్తతో | జాగ్రత్తతోం |
| 84 | 1 | Thore's | There's |
| 93 | 21 | బాగ్బజారు | బాగ్బజాఋ |
| 100 | 7 | మాడుచు | మాండుచు |